శ్రీరస్తు.

# ద్రౌపదీవస్త్రాపహరణము

ఐదంకముల నాటకము.



గ్రంథకర్త

విశ్వేశ్వరాయపుర

డి. లక్ష్మీనరసింహ్యాంగారు.




ప్రథమ ముద్రణ 2000.

పబ్లిషర్:—

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణబుక్ డిపో,

రాజమహేంద్రవరము.





1932.

[వెల 1–0–0.

## ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

పురుషులు.

1 కృష్ణుఁడు.
2 నారదుఁడు.
3 ధర్మరాజు.
4 భీముఁడు.
5 అర్జునుఁడు.
6 నకులుఁడు.
7 సహదేవుఁడు.
8 దృతరాష్ట్రుఁడు.
9 విదురుఁడు.
10 భీష్ముఁడు.
11 ద్రోణాచార్యుఁడు.
12 దుర్యోధనుఁడు.
13 కర్ణుఁడు.
14 దుశ్శాసనుఁడు.
15 శిశుపాలుఁడు.
16 జరాసంధుఁడు.
17 శకుని.
18 ప్రాతిగామి.
19 కృపాచార్యులు.
20 అశ్వద్ధామ.
21 సహదేవుఁడు.
22 మునీశ్వరుఁడు.
23 కాలనేమిబొట్టు.
24 భటుఁడు.
25 కొందరు ఋషులు.

స్త్రీలు.

1 ద్రౌపది.
2 గాంధారి. 3 చెలికత్తె.

☛ కొందరు రాజులు, సేవకులు మొదలైనవారు వత్తురు.

# ద్రౌపదీవస్త్రాపహరణము.

## నాంది.

---

శా. శ్రీరమ్యంబగు యాదవాన్వయమునం
శ్రీవిష్ణులీలాకృతిన్
శ్రీరంజిల్లగఁబుట్టి పాండుసుతులన్
చేపట్టి రక్షించుచున్
గారాబంబున సాధ్వి ద్రౌపదికి భం
గం బింతయున్ లేక స
త్కారుణ్యంబున నేలినట్టి ఘన కృ
ష్ణస్వామిఁ బ్రార్థించెదన్.

---



ఓం

# ద్రౌపదీవస్త్రాపహరణము.

## ప్రథమాంకః.

---

(కాలనేమిబొట్టు ప్రవేశించుచున్నాఁడు.)

కాల—(స్వగ) దైవమా! నేటికి జరాసంధుని పరిపాలన జగత్కంటక మై, క్రూర పరిపాలనఁగఁ బరిణమించినదిగదా? విష్ణునారా ధించు సాధుజనసమూహమునుబట్టి చెరసాలయందుఁ బెట్టుట యొగాక వారిని పశువులవలె గుఱ్ఱములకుగిది ఏనుగులభాతి తన విహారరథమునకుఁ గట్టి కొఱడాకర్రతో కొట్టి బహుశ్రమ లను బెట్టుచున్నాఁడు. రాజాధి రాజులపైకి సహితము దాడి సల్పి వారివారి రాజ్యములఁ వశముఁ జేసుకొనుటయొగాక వారిభార్యలను బలవంతముగ మోహించి, బిడ్డలను హతమొ నర్చి ప్రజల భూములపై నధికసుంకము విధించి, బ్రాహ్మణుల దండించి, వారినోట నీచమాంసములఁ గ్రుక్కుచు సురాపాన ము సహితము బలాత్కారముఁగ నోటఁబోయుచు, సమస్త ధనధాన్యంబుల సంగ్రహించి ఎల్లప్రజలను హింసించుచున్నాఁ డుగదా? క్రూరాత్ముఁడెట్టి పాపపు కర్తవ్యమునకైనను వెను దీయుట లేదు. ఆహా! భగవంతుడైన శ్రీమన్నారాయణ

మూర్తికేల కపికరము పుట్టకూడదు. అదిగో ఎవ్వఁడో ఒకము
నీశ్వరునిటు లీడ్చుకొనుచు జరాసంధుఁడు కాబోలు రథము
తో సహితము ప్రవేశించుచున్నాఁడు. నేఁబారిపోయెదగాక!

(నిష్క్రమించును.)

తెరలో

గీ. నిలువరామౌనికి జరా ♦ నిల్వమార
నీచమాంసాదులను మెక్క ♦ నేతలమని
మమ్ము నిందించినందుల ♦ కిమ్మహిని ను
దంతివిధమున రథము లా ♦ గింతు పశువ!

[అప్పుఁడు ఒకమౌని త్వరగఁ బ్రవేశించుచున్నాఁడు.]

మౌని—హా! పాపాత్ముఁడా! నీ క్రూర పరిపాలనఁ త్వరలో నాశన
మౌఁగాత! పరమేశ్వరా! దీనబంధూ! రక్షమాం! రక్షమాం!

[జరాసంధుఁడు కొందఱు మునీశ్వరులను రథమునకు గట్టుకొని
వారిని కొట్టుకొనుచుఁ బ్రవేశించును.]

అనుబంధము 1

జరా—భటులారా! ఆమౌనిపశువును క్షిప్రగతిబట్టి రథంబునకు గట్టి
పెట్టుడు.

భటు—చిత్తము. (రథమునకుఁ గట్టుచున్నాఁడు)

మౌని—పాపీ! నీపరిపాలన త్వరలో నాశనమౌఁగాక! పాపపుణ్యంబు
లరయక కేవలము క్రూరబుద్ధికి చుట్టమవై యిట్టి దారుణ
కృత్యంబులఁ జేయబూనిన నిన్ను భగవంతుఁడే హతమార్పఁ
గలఁడు.

జరా—దురాత్మా! ఏదీమరొకసారి నీబుద్ధిచాతుర్యము నీజరాసంధ
మహారాజుపై కనపర్చుము. రాజరాజునకు నీతుల బోధించు
చుంటివా? పాపాత్ముఁడు జరాసంధుఁడని ప్రేలుచుంటివా?
భటులారా! ఇదె నాయాజ్ఞవినుఁడు

సీ. శ్రీవిష్ణుభజనంబు ♦ చేయువారినిబట్టి
దండించి చెరబెట్టు ♦ చుండవలయు
మధుపానముసుగ్రోల ♦ మహా పాపమనువారి
నోటగోమాంసము ♦ నుంచవలయు
కన్ను విడంబించిన ♦ నరపాలకులఁజంపి
వారిభార్యలచెర ♦ బట్టవలయు
పన్ను చెల్లించని ♦ ప్రజలనుబాధించి
కొంపల కగ్గిము ♦ట్టించవలయు
గీ. వినుడు మామకశాసన ♦ మును యతిక్రమించి చరియించువారి శి ♦ క్షించి మీరు
బలపరాక్రమ బుద్ధిచే ♦ పాపమనక
వారిభార్యల చెరమీరు ♦ బట్టవలయు.

నేను స్నానముఁజేసి వచ్చునంతకు యీ పశువులను రథము లాగింపుఁడు. అట్లు నిరాకరించిరేని చావమోదుఁడు చూచెదరేల?

(నిష్క్రమించును)

భటు—(అట్లుఁ జేయుమన్నాఁడు)

(సహదేవుఁడు ప్రవేశము)

సహ—భటులారా! ఇదేమిఘోరము. అనుచాగుఁడు ఈమహాయతీశ్వరుల నిటు దండించుట కెవరి యాజ్ఞయైనది.

భటు—యువరాజా! మీతండ్రిగారియాజ్ఞ.

సహ—కటకటా! మాతండ్రి యిట్టి ద్రోహమునకు సిద్ధపడుచున్నాఁడా? మానిపుంగవులారా! విచారింపకుఁడు. భటుఁడా! చూచెదవేల? ఈఋషీశ్వరులకుఁ గట్టిన బంధముల సడలింపుము. భగవద్భక్తుల నిటుహింసింపు ఘోరపాపమైన పనియని తెలియలేకపోతిరా?

## ద్రౌపదీవస్త్రాపహరణము.

ఉ. సాధులు సర్వదా విమల ♦ శౌరిమనంబున గొల్చుచుందు్రి, యా
సాధులపైన నీర్ష్యగొని ♦ చోరులయట్టుల శిక్షఁజేతురే
సాధులయందుఁ గేశవుఁడు ♦ సత్యముగుండు నటంచు తండ్రి! శా
స్త్రములయందుఁ జూడఁడె, స ♦ దా కలుషంబని యోజసేయడే.

పాపము! ఘోరపాపము! మహాపాపము!!! శీఘ్రగతి నీరిని బాధవిము
క్తుల గావింపుము.

భటు—యువరాజా! మీతండ్రిగారి యాజ్ఞ నతిక్రమింప వలనుపడ
దు. పోయి మీనాయనగారితో నీసంగతి విన్నవించి త్వరలోఁ
దోడి తెచ్చువఱకు వేచియుండుఁడు.

[నిష్క్రమించును.]

సహ—(బాధముల సడలించి) మహాత్ములారా! వందనములు. మా
తండ్రి తెలియకఁ జేసిన యీదారుణ కృత్యంబున కాగ్రహా
యత్తచిత్తులుఁగాక నిత్యానంద హృదయులై మీ మీ ఆశ్రి
మంబులకు దయచేయుఁడు.

మౌని—చిరంజీవుడవుకమ్ము సహదేవా! నీభక్తికి మెచ్చితిమి మేము
బోయి వచ్చెదము.

(ఋషీశ్వరులు నిష్క్రమింతురు.)

సహ—మాకులంబునఁ బుట్టినవారి కేలనో కాని, యిట్టి విపరీతబుద్ధులే
బుట్టుచుందురని నిన్ననే నాపాఠపుస్తకములో చదివియుంటిని
శ్రీమహావిష్ణు శక్తి గ్రహింపనేరక మావారు విరోధులై వివి
ధకష్టములకు పాలై తుదకు నాభగవంతుని చేతిలో హతులై
అనన్యమోక్షపదవి గాంచుచుండిరి. యతీశ్వరులం బంధించి
వారినోట నీచమాంసాదులఁ గుక్కి బహుశ్రమలపాలుఁజేసి
ఘోరపాపంబునకు లోనైన మాతండ్రి నేమనవలయు? పా
పాత్ముఁడనవలయునా? లేక పరమభక్తుల పాలిట యముఁడనవల

యునా? ధరణీపాలురు చేయవలసిన ధర్మకార్యములకు మారు దారుణకృత్యములా యివి. కటకటా! ఆమునీశ్వరుల శరీరము లెంత నొచ్చినవో వారు ఆకొఱడాదెబ్బల కెంతగా విలపించి ప్రార్థించిరో కదా?

జరా—(భటునితో సహా ప్రవేశము) ఓకీ! శుక! ఆపసువులను బాధ విముక్తుల గావించితివా? భటుఁడా! నీవుపోయి నాయాజ్ఞగా మనభటసమూహమునకు చెప్పి ఆమునీశ్వరులఁబట్టి కట్టింపుము పొమ్ము.

సహా—తండ్రీ! ఇదేమి క్రూరపరిపాలన తండ్రీ!

అనుబంధము 2

భగవద్భక్తుల శిక్షింప మనతరమా? ... గులయందు శౌరి నిత్యము కనిపెట్టుకొని యుండును.

గీ. ఎవని కారుణ్యవృష్టిచే ♦ నీజగాన
వివిధవిధముల జీవులు ♦ వెలయుచుండు
నట్టికేశవు భజయించు ♦ నట్టిపరమ
భక్తులను శిక్షజేయు నె ♦ వ్వారితరము.

జరా—బాలకా! నీవుచిన్నవాడవగుటంజేసి నిజానిజంబులు గ్రహింప జాలవు. నీవు పొమ్ము గృహంబునకు. భటుడా! రమ్ము. వారిని బట్టి కట్టి రథంబును లాగింతము.

(నిష్క్రమింతురు)

సహా—ఆహా! చెట్టు చెడుకాలమునకు కుక్కమూతి పిందెలు పుట్టు నన్నట్లు, మనుష్యులకు కూడ దురుద్దేశములు పుట్టుచుండును. కానిమ్ము నేపోయి నాజనకుం బ్రతిమాలి సాధుజనులం గాపాడెదగాక! (నిష్క్రమించును.)

## 2 వ. రంగము.

### గిరివ్రజపుర చెరసాల.

(బర్బర, సింహళ, ద్రావిడ, కళింగ దేశాధి రాజులు కారయందుందురు.)

### అనుబంధము 3.

బర్బ—హా! వసుదేవనందనా! శ్రీహరీ! మావిన్నపముల నాలంకిపవా? ఓ నారాయణా! మమ్ము రక్షింప నింతపట్టుదలయా? పరాత్పరా! పాపాత్ముండు జరాసంధుని పరిపాలన కన్నులారా గాంచి కానివానివలె నూరకొన్న మాంగతియు మాని బృందావళిగతియు నేమిగాను. రోజుకొక నృపాలుని భైరవీపూజకై వధించుచున్నాడు.

గీ. ఆలుబిడ్డలవీడి ధ ♦ నంబులోడి
స్నేహబాంధవ్యములను త్య ♦ జించిరా
జ్యములకే దూరస్థులమగుచు ♦ భువిని ఘోర
బాధనకుజిక్కినాము కా ♦ పాడుదేవ!

సింహ—ఎట్టిమహారాజులకెట్టి మహాపదలు ఘటించితీరినవి. పరమేశ్వరా! దీనబంధూ! జరాసంధుని దుండగముల నెప్పుడు హరింతువో? ఆనూరాత్ముని యసువుల నెప్పుడు దీతువో? తావకీభక్తుల నెల్లప్పుడు రక్షింతువో? అంతయునీదే బాధ్యత. ఈజీవహింసకుని హతమార్పుము.

శా. శ్రీరామా! యనుకొంటిచిత్తమున నే ♦ చేతుల్ కదుర్ మోడ్చిన
త్కారుణ్యంబున బ్రోవుమంచునిశితిన్ ♦ దాసుండ జోహారులో

కారుణ్యాకర! గాంచి దుండగులలో ♦ క బ్బాదుబోకార్చియున్
గారాబంబున నమ్మ్మ నింకెపుడు ర ♦ క్షుంజేతువో మాధవా!

ద్రౌప——కృష్ణా! రూపజితస్మరాయా! రక్షింపుము. భక్తవత్సలుడవు కావా? భక్తుల రక్షింపలేవా?

ఉ. రూపజితస్మరాయ గన రూ ♦ ఢి సురోపస్వభావకాయ దో
షాపహరాయ భక్తసుజ ♦ నాశ్రియముఖ్యపుకారణాయ స
త్తాపససంస్తుతాయ వసు ♦ ధారమణాయ పరాక్రమాయ పృ
థ్వీపయివందితాయ నిజ ♦ ధీరగుణాయ నమోనమోనమః.

ఓ నారదాదిమహామునివందితాయా! నారాయణాయా! ఇంకను దయ వహించి రావయా!

(నారదుఁడు ప్రవేశము.)

నార——(స్వగ) ఆహా! దుర్మార్గులకు తావిచ్చిన దోషరహితులను సహితము దుర్భరదుఃఖకూపమున ద్రోయించి బహుశ్రమలం బెట్టుదురుగదా! ఈజరాసంధుని దుష్టపరిపాలనము ఎంతకు విజృంభించినది. కటకటా! ఈసాధుజనసమూహామునకు శ్రమ చూడఁజాలకుంటిని. కానిమ్ము, జరాసంధుని దుష్టపరిపాలన విధానమున నాక్షుద్బాధకొంతచల్లార్చుకొనుటకు అవకాశము గల్గినది.

గీ. సంతతము కయ్యమును బెట్టి ♦ సంతసంబు
గాంచుమని వ్రాసియుండెనా ♦ కమలభవుఁడు
ప్రీతికరుఫలంబు చేకూరె ♦ వసుధనేఁడు
ద్రౌపదీమానరక్షణ ♦ రూపకంబు.

పుట్టించిన పరబ్రహ్మ భోజనమేల పెట్టకుండును? ఇప్పుడీ జరాసను మారణోపాయమొనర్పవలయు (ఆలోచించి) ఆ. నేనిప్పుడు

పించు నరపాలకుల నూరడించి, ఈసాధుజనులకు ధైర్యముజెప్పి, ద్వితీయపాండవుడైన వృకోదరునిచే కృష్ణార్జునుల ప్రోద్బలంబున జరాసంధుని యాహాభావమునకు చేటుగల్పించెదనుగాక! భైరవీపూజ నెపంబున రాజులనుకూడ వధించుచున్నాడు.

(సమీపించుచున్నాడు)

రాజులు—(అందరు) నారదమునీశ్వరా! నమస్కారములు.

నార—సుఖీభవః! మహాపురుషులారా! మానులారా! విచారింపకుడు. కొలది దినములలో భీమసేనుండు కృష్ణార్జునుల సహాయంబున జరాసంధుని యసువులం హరించి మిమ్ము కారాగారవిముక్తులం జేయుగలండు. కావున అంతవఱకు ధైర్యము నవలంభింపుడు. నేనిప్పుడేపోయి వారి నీకర్తవ్యమునకై ప్రోత్సాహించెదను.

రాజులు—మహాత్మా! ధన్యులము.

నార—మీకు భయములేదు. శీఘ్రమే మీకష్టములు బోయగలవు.

(నిష్క్రమించును)

(తెరబడును.)

ప్రథమాంకము సంపూర్ణము.



ఓం

# ద్రౌపదీవస్త్రాపహరణము.



ద్వితీయాంకము.

---

పంచపాండవులు ఉచితాసనములపైనుండ నారదుఁడు గానము చేయుచు ప్రవేశించుట.

అనుబంధము 5.

నార—(స్వగ) ఈసభానిర్మాణము నిజము కౌరవపాండవ మహావైర వృక్షంబునకుఁ బోదెయైనది. ఈసందర్భమున పాండురాజు వృత్తాంతంబుగూడ పాండవులకుఁదెల్పి రాజసూయాధ్వరనిర్వహణంబునకు మార్గముచక్కఁగఁగల్పించి కురుపాండవ వైరానలమును విజృంభింపఁజేసెదనుగాక! అదుష్టజరాసంధ శిశుపాలురుగతించినగాని లోకారిష్టము, లోకవిచారము తగ్గదు. అనన్యలభ్యమున పూర్వనిర్మితమునగు నిట్టి సభాప్రేక్షణము కన్నులపర్వంబానర్పజేయుచున్నది. పాండవ విద్వేషులైన కౌరవులకు నేనిర్వహింపబోవు రాజసూయాధ్వర నిర్వహణము దోహదము కాకపోదు. కానిమ్ము, నేనిప్పుడే పాండవుల సమీపించి పాండురాజు వృత్తాంతము విశదీకరించెదను.

(పాండవులను సమీపించును.)

ధర్మ—తమ్ములారా! ఆవీణాగానము నారదమునిపుంగవునదనియె దో
చుచున్నది. ఆయతీశ్వరుం దోడితెచ్చెదమురండు.

అర్జు—అన్నయ్యా! నేడుమనమెంతయు ధన్యులము.

(అందరు నారదుని తోడ్కొని తెచ్చుచున్నారు.)

ధర్మ—(చేతులు మోడ్చి)

సీ. వందనమో లోక ♦ వందిత సుగుణ వి
ధాతృనూజనా ♦ తతము నీకు

భీము—(కరములముకుళించి)

ప్రణుతిశతములు య ♦ పారసుందరరూప
నిత్యసమ్మోదము ♦ నీకసీకు

అర్జు—(హస్తములుజోడించి)

టెంకణాలోకిప్ప ♦ శంక పంకజనేత్రి
కామవిహీన సం ♦ గ్రామనీకు

నకు—జేజేలులోకవశిద్ధవానీకసం
స్తనముఖ్య సద్భ్రి ♦ చారినీకు

సహ— గీ. ఘననమస్కారశతములు ♦ గర్వయుతుల
గర్వపరిహార! కారణ ♦ నిర్వికార
నారదా! శారదా ముద్దు ♦ నందనా! వి
శేష వేదపారాయణా ♦ స్థిరమునీకు.

నార—కళ్యాణసిద్ధిరస్తు! ధర్మరాజా! నీవెంతేయు నదృష్టవంతుఁడవనీ
దలంతును. యేమందువేని నిరంతర సత్యవ్రతాచరణుఁడవైన
నీసహాన్నత్యమునకున్ను—నీప్రభావమునకున్ను తగిన మయ
సభాప్రాప్తి లభించినది. రాజాధిరాజువై, సకల మహీచక్రిం

యునకు నేకచ్ఛత్రాధిపత్యము వహింపఁగల మహీపాలుఁడవు,
ఈసభ నీవంటివానికి రక్షణంబుఁగాని సర్వదా క్రూరస్వభావు
లైన కౌరవేయులకుఁ దగ్గునా ?

ధర్మ—మునీశ్వరా! అయ్యది తమవంటి మహాభాగవతోత్తముల కరు
ణావిశేషమేగదా!

నార—రాజా! కాదు కాదు. నీయొక్క అపూర్వసత్యవ్రతాచరణమే,
నీకీర్తికి కారణము. అసత్యప్రవర్తకులును—కపటస్వభావులును
అయిన కౌరవేయులకు యిట్టి యశము ఘటించునా?

చ. ఘనులగు పాండవేయులకుఁ ♦ గాక సభాపరిపాలనంబు యీ
వినయవిహీనులైన కురు ♦ వీరుల కేలను కాల్పనా? భువిం
గని విన లేదు యిట్టిసభ ♦ కార్యధురీణయుధిష్ఠిరా! భవద్
ఘనయశమింక లోకమున ♦ బాగున మ్రోగుచుఁగాక నిత్యమున్.

ధర్మ—మహామునిరాజా! మీ రింతఃపూర్వం బెచ్చటనైన నిట్టిసభలం
గాంచిన, నాకాసభావిశేషము లెఱింగించి నన్నుఁ గృతార్థుని
జేయుఁడు.

నార—యుధిష్ఠిరా! అన్యసభల విషయమున కేమిగాని, మయుని శిల్పి
విద్యాప్రవీణత మహన్యసామాన్యమని పొగడవలయునుగదా!
ఆసంవృతద్వార మహాత్మ్యము మయుఁడు నీకు విశదీకరించి
వచించియున్నాఁడా?

అర్జు—పూజ్యనీయా! కపటహృదయులును—కలుష ప్రవర్తకులును
అయిన దుష్టమనుజులకు యీసంవృతద్వారము వివృతముగను,
వివృతద్వారము సంవృతముగను గాన్పించునని, ద్వారప్రభా
వము మయుఁడు వచించెను.

ధర్మ—నారదఋషీంద్రా! మయుని ప్రభావము తమ రెఱుఁగనదియా?
దాని కేమిగాని, దేవేంద్రుని సభావిశేషములను—ఆమహావైభ
వములను విపులముఁగ నెఱిగించినను ధన్యునిఁ జేయుము.

**నార**—(స్వగ) భళీ! ఈప్రసంగసందర్భమునఁ బాండునృపాలుని వృత్తాంతము వచింప నవకాశము చిక్కినది. జరాసంధశిశుపాలుర సంహారమార్గము స్వకపోలకల్పితముగఁ గల్పించి, శ్రీకృష్ణ జరాసంధ వైరానలమునకున్నూ—కౌరవపాండవ వైరవృక్షంబునకున్నూ—నేనిర్వహింపఁబోవు రాజసూయాధ్వర నిర్వహణంబు దోహదముగాఁగావించి అమందానందకందళిత హృదయుఁడ నయ్యెదఁగాక! (ప్రకా) పాండవజ్యేష్ఠా! యుధిష్ఠిర భూపాలా! త్రిలోకాధిపతియుఁ, బూర్వదిక్పతియునగు శచీపతి సభకున్నూ—మీసభకున్నూ గల విశేషమేమనఁగాఁ నచ్చట రంభోప్సరాంగ దేవవేశ్యలు నాట్యముచేయ, యమ వరుణ కుబేరాదులును, హరిచంద్రుఁడును కొలువ శచీపతి సభ నలంకరించి యుండును. ఇత్యాదియే విశేషము.

**ధర్మ**—మునీంద్రా! మదీయప్రియజనకుఁడగు యముని సభ యెట్లుండును.

**అర్జు**—మజ్జనకుండైన వాసవసభావిషయములకేమిగాని, నారదా! వైవస్వతుని సభావైభవములు దెల్పుము.

**భీము**—కలహప్రియా! సభావిషయములకేమిగాని, ఒక్కమనస్సంకోశము నన్నుపీడించుచున్నయది. యెట్లియన, హరిశ్చంద్రుండే అమరపదవి నొందెనని వచించియుంటిరి. హరిశ్చంద్రుఁడంతటి భూరిఘనుఁడు మాతండ్రి పాండురాజు దేవేంద్రలోకమున లేడా?

**నార**—(స్వగ) ఈభీమసేనుఁడు డొంకకదిపినాఁడు. నాకోర్కె నెరవేరు నమట సత్యము (ప్రకాశముగ) మీజనకుఁడు వైవస్వతుని సన్నిధియున్నవాఁడు.

**అర్జు**—(స్వ) ఆహా! హరిశ్చంద్రుఁడంతటి ఘనుఁడు యమలోకవాసంబున నుండుటకు కారణమేమైయుండునో? అన్నయా! మన తండ్రి వైవస్వతుని సన్నిధినుండుటకు హేతువెద్దియోగదా?

**ధర్మ**—విస్మితనయా! నారదా!

గీ. ఘనహరిశ్చంద్రుభోలు మ ♦ జ్జనకుఁడైన
పాండు భూపాలుఁడే యమ ♦ పట్టణమున
నిడుమలను గుడుచుటకు నే ♦ మేమిదోష
ములను జేసెనో వచియింపు ♦ మునికులేంద్ర

**నార**—శమనపుత్రా! మీజనకుండు దోషరహితుండు, పుణ్యుండు, మీతండ్రియందును హరిశ్చంద్రునియందును కించిద్ వ్యత్యాసముఁగలదు. రాజసూయము సకలరాజులు భయంబునంద సాదుజనసమూహామతి సంతోషమునొంద, శత్రురాజులు కప్పములంకట్టి, బ్రాహ్మణోత్తములకు భూరిసంభావన లివ్వ సర్వజనసుఖంబుగ నిర్విఘ్నముఁగఁ ద[illegible]కుఁడు నెరవేర్చె. అద్దానంజేసి హరిశ్చంద్రుఁడు వాసవసాలోక్యంబు గాంచనర్హత గల్గెను.

**నకు**—నారదఋషీంద్రా! రాజసూయము మేముజేసిన మాతండ్రి స్వర్గోపసుఖవిష్టుండు కాడా యేమి?

**నార**—కాకేమి? ధర్మరాజా!

చ. ఘనులగుమీరు సూడ మఖ ♦ కర్జముదిగ్విజయంబుఁగాధరా
మునిజనులెల్లరుం గరము ♦ మోదమునొంద సమస్తరాజులున్
మనమున భీతినొంద ఘన ♦ మానవనాథ యొనర్చితేని మీ
జనకుఁడు దేవలోకసుఖ ♦ సంపదగాంచు నిజంబు ధర్మజా!

అందును నే వచింపఁబోవుచుండ మీరడ్డుతగులుటచే మఱచితిని. మీతండ్రి నేను యమలోకమునకు బోవ నన్నుగాంచి భూలోకమునంగల నాకుమారులతో నీసంగతికూడ దెల్పి రాజసూయయాగము చేయించి నాయిడుములం బాపుమని వచించెను,

భీము—తండ్రివిషాదముదీర్చ బిడ్డలకు ముఖ్యకర్తవ్యము కావున, అన్నయ్యా! మనమును రాజసూయయాగము నిర్వర్తింతము.

నార—శమనాత్మజా! విచారించెదవేల?

గీ. శాంతచిత్తుండవు శుభుఁడవు సార్వభౌమ
పదవిఁగొన్న నజాతశ ♦ త్రుఁడవైరివీవు
ధర్మజా! నీకసాధ్యంబు ♦ ధరనుగలదె
శీఘ్రముగఁతిరాజసూయంబు ♦ చేయుమధిప!

శ్రీకృష్ణపరమాత్ముఁడు నీకు ఆప్తబంధువైయుండ నీరాజసూయయాగంబునకు మరేప్రమాదముగాని శత్రురాజుల భయంబుగానిఁ గల్గనేరదు.

భీము—ఏమీ? గదామాత్రద్వితీయుండనై యాగసాలకడ నేను నిలుచున్న శత్రురాజులు సామంతరాజులు కారా? రాజసూయయాగంబు నిష్ఫలముజేయు సాహసించుపశువు బ్రతికిబయట పడగలఁడా? అన్నయ్యా! నీవిచారముమాని కర్తవ్యమునకై యోజింపుము.

చ. ఎలమిని రాజసూయమఖ ♦ మేయది పూర్తిగఁ జేసి తండ్రిబాధలు సమయింపజేసి శుభ ♦ ధంబగు స్వర్గసుఖంబు గూర్చినక్క
కలియుగమందె గాక, కన ♦ గన్ జగతీత్రయమందుఁ బాండుపుత్రులఘనకీర్తి మ్రోగుసుమి ♦ దుఃఖముదేలనువీడు మగ్రజా!

అర్జు—అన్నయ్యా! నారదునివాక్యమునం దనృతములేదు. రాజసూయయాగము చేసిన మనతండ్రి యనన్యకైవల్యంబుగాంచును. కావున నీవిచారము వీగి దిగ్విజయోపాయంబును రాజసూయయాగ నిరహణోపాయంబును యోచింపుము. అన్నిటికి మన కేడుగడయైన గోవిందుఁడు మనకు బంధువైయుండ విచారమేల?

గీ. ఎలమి క్షత్రియుఁడై బుట్టి ♦ యెల్లరాజ్య
ములకుఁ బ్రభువైనవాఁడు నీ ♦ భూమియందు
రాజసూయమఖంబె హా ♦ ర్థముసల్పి
రాజధర్మమునఁగనవలె ♦ తేజమెసఁగ.

నార—రాజా! ఇఁకనాకు దడవౌచున్నది పోయివచ్చెదను. రాజసూయము మాత్రము నెరవేర్చి నీతండ్రికి మోక్షంబు ఘటింపఁ జేయుము. (నిష్క్రమించును.)

ధర్మ—తమ్ములారా! ఇపుడు కర్తవ్యమేమి? రాజసూయము మాట నాకేమియు స్ఫురింపకున్నది. చేయుదమా? మానుదమా?

భీమ—యాగము నేల మానవలయును. పరమపవిత్రులైన కుంతీపాండునృపాలురకు పుత్రులమై జగద్విఖ్యాతిగాంచిన శూరులమై తండ్రిదుస్థితి చెవులారవిని చవటలమై మూలదూరిన ప్రపంచమున తీరని యవమానమునకు పాత్రులము కాగలము. అందును నలుగురలో తలవంపులు ఘటించితీరును.

ధర్మ—తమ్ముఁడా! వృకోదరా! నాయభిప్రాయమేమనగా, రాజసూయాధ్వరనిర్వహణమున ప్రకుంచమున విలయసమము గు ఘోరమైన యుద్ధముగల్గుననియు, ఆకారణమున గొప్ప హింసగల్గుననియు నాసంశయము.

అర్జు—అగ్రజా! ప్రజాసంక్షోభమనియు, హింసయనియు, రాజసూయము గావింపకుంటిమేని, తీరని యవమానమునకు పాత్రులము కాగలము.

ఉ. ధారుణి రాజసూయమది ♦ దండిపరాక్రమవంతుల్ విధిలీ
వైరులబాధకే వెఱచి వ్యర్థము ♦ జేసిరటంచు భూజనుల్
చేరివచించుకోరే? కడు ♦ ఛీ యని నిందను సేయరేయికీ
తీరునజాటుచుండరె యు ♦ ధిష్ఠిర! యోసడికోర్కియుందురే.

నకు.—అన్నా! ఆ యపనిందమాట యటుంచుము.

ధరణితనయులఁగన్నట్టి ♦ తండ్రులకిల
భూరిఫలమేమి? పుత్రులు ♦ పుట్టనేమి?
పుట్టియున్నను పిత్రూణ ♦ మును హరించి
సద్గతుల్ గూర్పనిజసుతుల్ ♦ సహజగుణము.

సహా—ఘోరాజికి భీతిల్లి కన్నతండ్రికి దుర్గతుల గల్పింప పుత్రులైన వారికికూడదు.

గీ. ఘనుఁడగు బ్రహ్మగాని శం ♦ కరుఁడుఁగాని
వాసవుఁడుఁగాని యలవైన ♦ స్వతుఁడుగాని
వచ్చుఁగాక యుద్ధమునకు ♦ వసుధమనము
రాజసూయంబుమానంగ ♦ రాదునిజము.

భీము—అన్నయ్యా! యుధిష్ఠిరా! ఈ రాజసూయయాగమాహాత్మ్యమున మనకెంతయు కీర్తిగల్గుటయేఁగాక దానంజేసి మీఁదుమిక్కిలి మనకెన్నియో శుభంబులు ఘటించును.

సీ. తాతముత్తాతల ♦ పాతకజాలంబు
లవి పటాపంచలై ♦ యరుగుటొకటి!
నిరపరాధులకెన్నొ ♦ యిక్కట్లు గల్పించి
శిక్షించు నృపతులం ♦ జెండుటొకటి
యెల్లరాజులనుండి ♦ యింపుగఁగప్పముల్
ప్రకటితబలముచే ♦ బడయుటొకటి
పాండుసూనులయొక్క ♦ ప్రతిభావిశేషంబు
పండితార్యులనోట ♦ వడుటయొకటి

గీ. శమనపురమున క్లేశము జెందు ♦ జనకునకు, య
దన్యకైవల్యపదవి నొ ♦ సర్చుటొకటి

అన్ని కార్యంబులను నొక్క రాజ్ఞనుమని
సిద్ధమైయుండ అగ్రజా! చింతయేల?

అందును మనకన్నివిధముల తోడునీడైయున్న మన మేనబావ శ్రీకృష్ణమూర్తి మన సన్నిధినుండ సంకోచమేం?

ధర్మ—తమ్ములారా! మీ రెల్లరకు రాజసూయయాగమునం దభిలాష యున్న నేనేల వలదనవలయు. అంతయు గోవిందునిపైనిడి, యాగాచరణకు పూనికొందును. తమ్ముడా! ధనంజయా! నీవిప్పుడే సత్వరగతి కొందరు చారులతో సహా రథంబునెక్కి ద్వారకకుంజని శ్రీకృష్ణమూర్తితో నీయుదంతమెరింగించి కార్యాలోచనంబడిగి ఆమహాత్ము నిచ్చటి కొకసారి తోడితెమ్ము.

అర్జు—ఆమహాత్ముని యనుజ్ఞవడయుటయే ముఖ్యకర్తవ్యము అట్లే పోయివచ్చెదను.

(అందరు నిష్క్రమింతురు.)

---

## 2 వ. రంగము.

---

### ద్వారకాపురి.

(కృష్ణార్జునులు ఆసీనులైయుండ తెరలేచును)

కృష్ణ—బావా! నారదుడట్లు వచించెనా? అట్లైన జరాసంధ శిశుపాలుర కాలముకూడ చేరువైనది. రాజసూయయాగ విధ్వంసకులు వారుతప్ప యన్యులు ఎన్నడు విధ్వంసము చేయరు.

చ. బావలు మీరుగాని పెఱ ♦ వారికి దోడ్పడ నెన్నఁడేనియున్.
భూవలయంబునందు వెస ♦ మున్ కడు దిగ్విజయంబొనర్చి, మీ
భావమునందు సూతయుతు ♦ మానముఁ జెందఁగఁ బోకుఁడింకనే
బోవఁగఁ జేతుయాగమును ♦ భూరికృపాత్ముఁడనై ధనంజయా !

అర్జు—మాధవా! నీయనుగ్రహము గల్గిన మాకెట్టి లోపమును గలుగదు. ఇంద్రప్రస్థపురమునకు బయలుదేరుదము రెండు.

సేవ—(ప్రవేశించి) దేవా! జయము! జయము! ఎవరో ఒకభూపాలుడు దేవరదర్శనార్థమై ద్వారముకడ వేచియున్నాఁడు.

కృష్ణు—లోనబ్రవేశ పెట్టుము.

పుష్ప—(ప్రవేశించి)

గీ. రాజ్యమునెల్ల దాయల ♦ ప్రాప్తిజేసి
భార్యలను జరాసంధుని ♦ వశము జేసి
అన్నిటికి దూరమైన రా ♦ జాధముండు
ప్రణుతులిడుచుండె గానుమ ♦ గోపాలకృష్ణ !

కృష్ణు—ఓయీ! నృపాలా! ఆపీఠమున ఆసీనుడవుకమ్ము.

పుష్ప—(కూర్చొనుచున్నాఁడు.)

అర్జు—ఏమీ? జరాసంధుని పరిపాలన అంతక్రూరపరిపాలనగ విజృంభించినదా?

పుష్ప—మాధవా! ఆజరాసంధశిశుపాలుర దుండగముల వచింప నాకు సిగ్గగుచున్నది. వేయియేల పాపపుణ్యంబులకు వెఱువక అనేక ఘోరకార్యముల జేయుచున్నారు, భైరవీపూజ నెపంబున నృపాలురను వధింపుచున్నాఁడు.

కృష్ణు—ఆక్రూరుల దుర్నయములంత భయావహములుగనున్నవా? మాళవభూపాలా! విచారింపకుము. ఎల్లియే జరాసంధుని మార

గము. పొమ్ము నీరాజ్యము నీకు మరల సంప్రాప్తింపఁజేసి నీభా ర్యాబిడ్డలను నీకర్పింతును.

పుష్ప—(నిష్క్రమించును)

అర్జు—కృష్ణా! ఆజరాసంధుఁడు ధర్మవేత్తయని వింటినే? ఆతఁడింతటి దుర్నయములకేల పూనెనో తెలియఁజెప్పుము.

కృష్ణ—ఆదురాత్ముఁడు తన్నుస్తుతించిన వారిని శిరసుపై నెక్కించుకొనుచున్నాఁడు. విష్ణునారాధించిన వారినిగాని, తనకు బుద్ధి చెప్పువారినిగాని, చావమోఁదుచున్నాఁడు. ప్రజాలోకము పరిపరి విధముల పరితపించుచున్నది.

అర్జు—దేవా! దేశమున కింతటి దుస్స్థితిఘటించి తీరినది. ఆశిశుపాల జరాసంధులు మనబంధు కోటిలోనివారుగదా! అయ్యది మనకును అవమానహేతువే?

కృ—మనమిప్పుడే యింద్రప్రస్థమునకరిగి మీయగ్రజునకీసంగతి విశదీకరించి, రాజసూయయాగనిర్వహణమున నెట్టులైన ఆజరాసంధుని మనభీమునిచే జంపింపవలయు లెమ్ము

గీ. యిలజరాసంధశిశుపాల ♦ కలుషమతులు
మడిసినంగాని లోక ♦ మానవతుఁలు
సంతసింపరు కలుషంబు ♦ సమసిపోదు
మానిబ్బ దాళి కష్టముల్ ♦ బాసిపోవు?

అర్జు—సేవకా! రథమును సిద్ధపర్పుము.

సేవ—(ప్రవేశించి) దేవా! సిద్ధపరిచియే యుంటిని. దయచేయుఁడు.

కృష్ణ—అర్జునా! రమ్ము. మనమింద్రప్రస్థమునకుపోవుదము.

[నిష్క్రమించును.]



కృష్ణ—నిజంబునే చెప్పితిమి.

జరా—దుష్టా! ఏమని?

అర్జు—నీపాలిట కాలయములమని? తెలిసినదా?

జరా—ఔరా! మీమీ వాగ్దోషములు మేరమీరుచున్నవే?

చ. నిజము వచింపలేనినినుఁ ♦ జీ మగధాధిపుఁడైన వీరుఁడే
నిజ కరవాలవైరిటులచె ♦ నిక్కము కాలుని చెంతఁజేర్చు, మీ
ద్విజమృష వేషముల్విడిచి ♦ వేగవచింపుఁడు మీరలెవ్వరో
ద్విజవరులైన దుందుభుల ♦ ద్రుంచుటయేలను దుర్మదాంధుఁడా!

ఇదె నీ శాత్రవాధికరవాలము. చెప్పుఁడు మీరలెవ్వరు? మీది ఏ రాజ్యము?

కృ—ఓరీ! క్రూరమాగధా!

ఉ. ఓరి! దురాత్మ! మేము ధర ♦ యుజ్వల శౌర్యముతోడ నీపుర
ద్వారముఁజేరి దుందుభుల ♦ దర్పమడంచి, సుమంబులన్ కడున్
సారసుగంధమాల్యముల ♦ సాహసమొప్ప హరించి, చెచ్చెరన్
ధారుణి నీదుయేపడప ♦ తప్పక వచ్చినవారమీధరన్.

జరా—ఓరోరి! కపటబ్రాహ్మణ వేషధారులారా! నాయేపుగాదు. ముందు మీ ప్రాణంబులం గాపాడుకొనుడు.

శా. ఓరీ! వంచకులార గర్వలమునం ♦ యోహోరి మీముప్వురన్
ఘోరంబైన కరాసివేగొనికడన్ ♦ క్షోణీస్థలిన్ గూల్చి నా
శూరత్వంబును వృద్ధిఁజేసెదను స ♦ త్యూరాత్ములైయైన దు
ర్వార ప్రక్రియ మాటలం విడిచి గ ♦ ల్వంరారె యుద్ధంబునం.

భీమ—ఓరీ! పాపీ! నీతోఁబోరుటకు ముప్వురు కావలయునా? కమండలమాత్రద్వితీయుండనై నేను నీతోఁబోరెదను. రమ్ము. నీయహంభావమణంచి జగద్భారంబుదీర్చి, ప్రజాలోకమునకు శాంతి గల్గఁజేసెదను.

జరా—ఏమీ? కమండలమాత్ర ద్వితీయుండవై నీవరుదెంచిన, కర
వాలమాత్ర ద్వితీయుండైన నాసేవకుఁడు నీగోవడంచువాఁ
డు. అధికప్రసంగము చాలించుఁడు. ప్రధనమున మీరలెవ్వ
రో వచింపుఁడు.

భీము—ఓరీ! మేము సుక్షత్రియులము, నీయసువులం హరింపవచ్చిన
కపటబ్రాహ్మణ స్నాతక వేషధారులము. వృద్ధిఁగాంచిన నీపా
ప ప్రభావము నేటికి ఫలించినది. రహ్మ్న

సీ. మౌనిపుంగవుల న ♦ మానుషగతిఘోర
వహ్నిఁ ద్రోయించిన ♦ పాపఫలము
సద్ధర్మయుతులైన ♦ క్షత్రియులను జంపి
వారిభార్యల బట్టు ♦ పాపఫలము
ఆచారవతులు బ్రా ♦ హ్మణులనోటను నీచ
మాంసంబు గ్రుక్కిన ♦ పాపఫలము
నోరెఱుఁగనిపసి ♦ వారలఁగానల
పాలుజేసినయట్టి ♦ పాపఫలము

గీ. నేటికిఫలించెనోరరి! నిం ♦ కేలనిజము
ధాతవ్రాసినవ్రాత యి ♦ ద్ధాత్రినేఁటి
తోఁడసరిపోయెమాపర ♦ దోర్బలంబు
అవనినినుద్రుంచి జనుల భా ♦ రంబుదీర్తు.

కృ—దుష్టా! మేముఎవ్వరైనది గుర్తింపలేకపోతివా? పాపదానచిత్తుం
డవై, భయంబుజెందక శ్రవణపేయంబుగా నాలకింపుము.

గీ. ఇతఁడు సురరాజుపట్టికి ♦ రీటి! ప్రథిత
వీరుఁడు ఘనుండు! మాగదా! ♦ యాతఁడే వృ
కోదరుఁడు! జగజ్జెట్టి! సం ♦ కోశమేల?
ఏనుకృష్ణుండననిమది ♦ నెంచుమిపుఁడె.

జరా—ఓహోరి! పిశాచపుత్రులారా! మీరా! మాయావేషంబున మామకశౌర్యంబునకు వెఱచి మద్పురంబుజొచ్చి పౌరుషవంతుల మని ప్రేలుచుంటిరా? ఇక మిమ్ము బార్హద్రథి ప్రాణంబులతో విడువఁడు.

శా. ఔరా! వంచకులార! ప్రేలకుఁడు ని ♦ క్కంబేమనున్మాఱెదర్
వైరుల్ మిమ్ముఁ బొఁడెందుఁబోనివను యా ♦ పాలాక్షుఁ డేవచ్చినన్
శూరత్వంబున బోవుసల్పెదను స ♦ త్యమ్మాత్మఁ దేయైన చో
ఘోరాజిన్నిలవండి రాక్షసములో ♦ గుల్తున్నికన్ భూస్థలిన్.

అర్జు—ఓరీ! మాగధా! భైరవపూజసేయు నెపంబున రాజులఁబట్టి నిండుప్రాణంబులఁ దీసినందులకు నీపాపఫలము చేరువయ్యెను, ఔరా! నీయజ్ఞానమునకు నేను మిగుల విచారించుచుంటిని. ఏమందు వేని? నీయంతటి దుష్టుఁడు—మూర్ఖుఁడు యిక పుట్టబోఁడు.

కృ—పాపీ! అతిగర్వాంధ పరిమత్తచిత్తుఁడవై ధర్మాధర్మవిచారణ వ్యర్థము జేసి, ఘోరమైన కృత్యములకుబూనిన నిన్నేమిసల్పినను దోషముఁ గానేరదు.

జరా—ఓహోరి చోరుఁడా! నిరంతరము నీచకృత్య విలాసుఁడవై యుపాల కలుషంబునకు లోనైన నీవా నాకు నీతులగరపుట, పాపీ! నిన్నిదె కాలుని సన్నిధికనుపువాఁడను

కృ—ఓరీ! దుర్మతీ!

ఉ. పరమతపోధనుజ్ఞరల ♦ పాలొనరించి పతివ్రతావళిన్
చెరఁగొని బల్మిఘోరముఁపు ♦ చింతఘటింపఁగ జేసినట్టి, నీ
దురమయఘంబు దుర్భరము ♦ సర్వముఁగాంచవిధాత నేఁటితో
సరిచునివార్చి నాయువది ♦ సర్వము పేర్చెలకు దుర్మదాంధమా!

అర్జు—పాపీ! ఆబ్రహ్మదేవుఁడు నీయాయువురేఖ నేటితో తుడిచివేసి యున్నాఁడు. నీవు బ్రదుకఁ దలచితివేని, నీవు చెరసాలయం దుంచిన నృపాలురను, సాధువులను వదలుము. లేదేని నీప్రాణంబు లా కాలునివీట కరుగఁగలవు.

జరా—ఓరీ! గర్వాంధా! నాకుఁ గాదు మీ ముద్వురకు నేను గొప్ప గండమని ఆబ్రహ్మదేవుఁడు సంపూర్ణాయువురేఖ మధ్యగా పెద్ద గీటుగీచియున్నాఁడు. నామూలమున నెందరో శరణాగతులై మీతావులకు మరలుఁడు. సత్యయంత్రభేదనంబు సల్పిన జగజెట్టినని గర్వించుచుంటివా? నీశరవిద్యాప్రవీణత మల్లయుద్ధవీరుండనైన నా కాలివ్రేలికి సరిపోదు.

గీ. బ్రహ్మ విష్ణు రుద్ర ♦ ప్రభువులే మద్భుజా
శక్తి భీతమునకె ♦ చాలనపుడు
మనుజులైన మీరు ♦ మల్లయుద్ధంబున
నిలువతరమె నన్ను ♦ గెలువతరమె.

భీము—ఓరీ! జరాసంధపశువా! అధిక ప్రసంగము కట్టిపెట్టుము.

ఉ. భీరములేల పెక్కుఘన ♦ భీముఁడు నిక్కపుమల్ల యుద్ధమే
కోరిపరాక్రమోదమున ♦ క్రోధకషాయితలోచనుండనై
ధారుణి నిల్చియుండ ఘన ♦ దర్పపుచోక్తులవేల మాగదా!
పౌరుషమున్నటేని ప్రగతి ♦ భండనమందున నిల్చి గెల్వగా!

కృ—ఓరీ! క్రూరమాగధా! ఈతఁడు సామాన్యుఁడనియా నీయభిప్రాయము. వేయిగజంబుల బలముకలవాఁడు, భీముఁడని తెలిసికొనుము.

ఉ. దంతి సహస్రభూరిబల ♦ ధాముఁడు సోముఁడు భీమమూర్తి దు
ర్దాంతభుజాబలంబున సు ♦ రాదులఁ గూల్చినమేటి, ఘోరకా
లాంతకు నేనిఁ డాయఁగల ♦ యాహవరంగ ప్రవీణుఁడీతనిఁ
పంతముతోడ గెల్వఁగల ♦ బ్రహ్మవశంబె దురాత్మ! మాగధా!

జరా—ఓరోరి! పిరికిపందలారా! పేర్లెన్నుఁడు నాబలంబునకు, నాలావునకు—నాయీడునకు తగిన పగానిషి లభింపక విచారించుచుంటిని. అందు కీతఁడు లభించినందులకు యత్యంతానందముఁ డనైతి. రండు ఆబహిరంగ ప్రదేశమునకే రణమొనర్తము. అప్పుడు నాదుర్వార బాహుపరాక్రమ ప్రభావము మీకు తెల్లము కాఁగలదు.

భీమ—లెచ్చగవచించితివి రమ్ము.

(అందరు నిష్క్రమింతురు.)

---

## 4 వ. రంగము.

---

(ఒంటరిగ కాలనేమిబోట్టు ప్రవేశము.)

కాల—భళీ! నేఁడుజరాసంధునిమరణవార్తా శ్రవణంబున సర్వజగంబులు ధన్యతగాంచినవి. మౌనిజనసమూహమంత్యంతసంతోష స్వాంతమున తమనివాసంబులకుపోయిరి. బ్రాహ్మణోత్తములు బ్రహ్మానందపరవశులైరి. యింతయేల జగత్కంటకము నశించి, రాజ్యము నిజధర్మాధర్మవిచారణకుఁ దొరబడి సౌఖ్యతగాంచునని రూఢిగావచించుటకుకూడ సూచనలు కనిపించుచున్నయవి

రాజశేఖరులు వారివారిరాజ్యముల వారు స్వీకరించి భార్యా
సుపుత్రులతో ధన్యులైరి. మామగధరాజ్యముకూడ దుష్టజరా
సంధుఁడు మడిసినను పరుల హస్తగతము నొందక, జరాసంధుని
కుమారుఁడును, కరుణాసముద్రుఁడును, హరిభక్తాగ్రేసరుఁడు
నగునట్టి సహదేవుని వశమాయెను. శ్రీకృష్ణభగవానుఁడు
సహదేవునకే రాజ్యము పట్టాభిషేకము జేయించెను. అల్లదె
కృష్ణభీమార్జునులను సాగనంపుచూ సహదేవుఁడు స్వసేనాసమే
తుఁడై ప్రవేశించుచున్నాఁడు నే నిష్క్రమించుచున్నాను.

(నిష్క్రమించును.)

(కృష్ణభీమార్జునులు సహదేవుఁడు ప్రవేశింతురు.)

కృ—బాలకా! నీతండ్రి మరణంబునకై విచారింపక సుఖంబుగ రా
జ్యంబేలి చిరంజీవుఁడవుకమ్ము. నీవు బాల్యదశలోయున్నను అ
ధికౌదార్యుండవును సకలసద్గుణ సముపేతుండవును అని బొగడ
వలసియున్నది మీతండ్రి హింసించు సకలరాజమానిబ్రాహ్మ
ణ సమూహజులనెల్లరను బ్రిజాక్షోభము సహింపజాలక విడి
పించుమని వేధంబుల ప్రార్థించినను విననందున నింతపని
సేయవలసివచ్చెను. నీజనకుండు నాకుఁ బగతుఁడైనను నీవు
నాకు ముఖ్యహితుండవేయని నమ్ముచున్నాను. మరణించిన
మీజనకునకై విచారము మానుము. అతఁడు యదన్యకైవల్య
పదవిగాంచెను.

సహ—దేవదేవా! నారాయణా

## ద్రౌపదీవస్త్రాపహరణము.

ఉ. నాపితరుండు వైరియను ♦ నామము మానసమందు నెంచి, యే
పాపమెఱుంగనట్టి నను ♦ బాయుట మీకు హితంబుగాదు, నం
తాపమదేలనాకు? నను ♦ తావక పుత్రుని యట్లు జూచినన్
యోపరమాత్మ కృష్ణ సు ♦ గుణోజ్వల దివ్యశరీరగావుమా.

ఉ. తల్లియు దండ్రియుఁగా మరియు ♦ దైవము సర్వము నీవెగాన, నా
యుల్లమునందు వేడెదను ♦ యోచనయేల పరాత్పరా! ప్రభూ!
చల్లని నీదయామానసము ♦ చల్లి కృతార్థునిజేసి తావకీ
నెల్లప్రభావ కీర్తియెడల ♦ మిగ కడునింపవె శ్రీరమాధవా!

కృ—కుమారా! నీభక్తికి మెచ్చితిని. నీవు నాముఖ్యబంధు సమూహ
ములోని వాఁడవును—నాభక్తజన సంఘప్రధానుఁడవును కాక
యన్యుఁడవగుదువే?

అర్జు—ఓయీ! సహదేవా! ఈవాసుదేవునకు, వైరియను వాఁడొకండు
ప్రపంచమునఁగలఁడా?

గీ. భక్తజనములు శ్రీకృష్ణ ♦ బంధుజనులు
క్రూరజనములు పరమాత్మ ♦ వైరిజనులు
పగనుసాధించు జనులు స ♦ ర్వజ్ఞురిపులు
శరణు జొచ్చిన జనులుఁగే ♦ శవుని హితులు.

భీమ—సహదేవా! నిన్ను వాసుదేవుఁడు యిప్పుడు నిక్కము రక్షిం
చెను. ఇంకను రక్షింపఁగలఁడు నీతండ్రి చావునకై మాత్రము
మనంబున వగలం బొగలక భగవదారాధనా తత్పరుఁడవై
సుఖంబుగ రాజ్యంబేలు కొనుము.

సహ—అయ్యా! శ్రీకృష్ణపరమాత్ముఁడు ముఖ్యదైవమైఁ గాపాఁడు
చుండ, యింక నాకు యన్యవిచారమేల? నేనెంతయు ధన్యుం
డను. ఏమందు నేని?

గీ. ఘోరపాపంబులవియెల్ల ♦ గూలిపోయె
ప్రజలబాధలు శమియించె ♦ భక్తమునుల
కష్టములుబాసె, నృపతుల ♦ కారలుడిగె
నవనితలమెల్ల ధన్యత ♦ నందెగాదె.

కృ—సహదేవా! నీవు చిరంజీవివై సుఖంబుగ రాజ్యంబు పాలించు కొనుము. ఇంక మేము పోయివచ్చెదము.

అర్జు—మగధభూపాలా! సహదేవా! ఇంక మేమెంతమాత్రము వాల స్యము సేయరాదు. చెచ్చెర యింద్రప్రస్థపురంబునకు జనవల యు. నచ్చట మాయన్న యుధిష్ఠిరుడు రాజసూయాధ్వరముc గావింప కుతూహలుండై యున్నవాడు. ఆయాగమునకు నిన్నును రావలసినదని ఆహ్వాన పంపెదము. అప్పుడు నీవు కూడ తప్పక రావలయునుసుమా?

భీము—సహదేవా! తప్పక నీవువచ్చి మారాజసూయాధ్వరముc దిల కించి గౌరవము బడయుము.

సహ—అయ్యా! భగవంతుడనుగ్రహించిన, తమయాగము పూర్తి కాక యుండునా? అటులే వచ్చెదను.

కృ—సహదేవా! యిక మేము పోయివచ్చెదము.

(అందరు నిష్క్రమింతురు)

(తెరవాలును.)

ద్వితీయాంకము సంపూర్ణము.







ఓం

# ద్రౌపదీవస్త్రాపహరణము.



## తృతీయాంకము.

---

స్థలము—యింద్రప్రస్థపురమందలి రాజవీధి.

(గానముచేయుచు నారదుండు ప్రవేశము.)

అనుబంధము 6.

నార—(స్వగ) భళీ! నారదుని కలహఫలవృక్షము వ్యర్థమానా? ఫలించి తీరుచున్నది. కూరిరజరాసంధుని సంహారకారణముతోనే లోకసంతాపసంతతియు నంతమై యత్యంత సంతోషస్వాంత భరితమైనది. ఇక దుష్టశిశుపాల పశువు మడియవలయు. రాజసూయాధ్వరనిర్వహణమార్గమే కలుషసంహార పరిహారమైనది. ఎందరో దుష్టులు హతులైరి. యికను హతులవనున్నారు. రేపటిదివసముతో రాజసూయము పూర్తి కాఁగలదు. అప్పుడు తప్పక నాశిశుపాల పశువు కేశవుని శితభక్తానల పాసమునకు జిక్కి నశుగతి నసువుల బాయఁగలఁడు. ఆహా! పాండవుల రాజసూయయాగమపూర్వమై, జగద్విఖ్యాతమై, సర్వజనానంద కందళితసంధానమై యొప్పారుచున్నదిగదా! ఆసేతుహిమాచల మధ్యస్థము, మహీపాలురెల్లరుం పాండవదండి ప్రచండ

భండనదవాగ్నిజ్వాలల కోర్వజాలక భయోత్పాత సంధాన చిత్తభ్రాంతులరై —రథగజతురంగ వాహనాదు లొసంగు వారు కొందఱు—ధనకనకరత్నాది ద్రవ్యను లొసంగువారు మఱికొందఱు—వేయిమాటలేల? ఎవరికిగల్గిన ద్రవ్యంబుల వా రొసంగి పాండవులకు సర్వదా విధేయులై యుండిరి. బ్రాహ్మణ సంతర్పణ లపరిమితము. వికలాంగులైనపరిజనలోకముపై జూపు ప్రేమ మగణ్యము-అనిర్వాచ్యము. పండితలోకమున కొసంగు పారితోషిక మపారము. ఇంతటి వైభవోపేతమైన మహారాజ సూయాధ్వర నిర్వహణమూ కౌరవే దుర్లకతి విచారకారణ భారము కాకయుండునా? దుర్యోధనున కియ్యది పరాభవఫల ముఁ గాకుండునా? చూచెదగాక. అల్లదే బ్రాహ్మణసమూహ ము పాండవయశఃకాంతను నుగ్గడించుకొనుచు నిదారికే వచ్చు చున్నారు. నేనును ఆపాండవులకడ కరిగెదగాక.

(నిష్క్రమించును.)

[కొందఱు బ్రాహ్మణులు ప్రవేశము]

1. బ్రా—విన్నావటోయి వెంకంబొట్లూ! ఈకురుగ్రివేధవకుసహా సంభావన మంతో సమంగాఁ కావాలట. నిన్నటిరోజున మనబ్రాహ్మణ సమూహమునకు సంభావనఁగాఁ నొసంగిన వేయి సవరునల బంగారము మంతో పాటు సమంగా పంచుకొళ్లాడు గదోటోయి?

2. బ్రా—మహాచక్రవర్తి! అజాతశత్రువునైన ధర్మరాజు భూపాలుఁ డొసంగిన సంభావన లపారముసుమా? ఆమహానుభావుని సర్వదా స్తుతింపవలయునే కదా!

3. బ్రా—ఏమిటోయి! సుంకంభొట్లా! మహాచక్రవర్తి ధర్మభూపాలుఁడు. మనలనెల్లరను సమముగా పంచుకోమని గాదటోయి సంభావనలుదయచేసారూ. నాకు సమముగాపంచకపోవడమేమిటోయి. ఇందుకు నీకింత పంతమెందుకోయ, రామావధాన్లుగారూ! మనదరిద్రదేవత ధర్మరాజు రాజసూయయాగముతో నశించిపోయినదయ్యా!

4 బ్రా—పాపిజరాసంధుని మరణముతోనే మనదరిద్రదేవత—కష్టదేవత—కనపడకుండా నశించిపోయినవి. ఆలస్యమౌతుంది, ఈ వేళకూఁడా మనపొట్టలనింపుకొని భూరిసంభావన లనుగ్రహించి వద్దాం పదండయ్యా!

5. బ్రా—ఉండరా! కుఱ్ఱవెధవ! కాస్త నెమ్మదిగా నడువరా? ముసలాణ్ణి నడువలేను,

(అందరు నిష్క్రమింతురు.)

## 2. వ రంగము.

### ఇంద్రప్రస్థపురము—దుర్యోధనుని భవనము.

(దుర్యోధనుఁడు, కర్ణుఁడు, శకుని, దుశ్శాసనుఁడు మొదలైనవారు ప్రవేశింతురు.)

శకు—రాజా! శౌర్యసైక విక్రమతేజా! నేఁడు నీముఖారవిందముఁ గాంచ బహు విన్నదనంబునకు లోనైనటుల గాన్పించుచుండెదు.

## అనుబంధము 7.

చ. సకలధరాతలంబు కను ♦ సాహసమొప్పగ పాలనంబు "తా
వకఘనకీర్తిలోకమున ♦ ప్రకటలీలఁ జెలంగ" నల్పున
త్ప్రకటితనేతవీవు ఘన ♦ ప్రాభవవైభవ మేత్యజించి, యూ
రకనిటు చెల్వ దక్కి కను ♦ వాత్మవిచారము బూనెదేలొకో.

కర్ణు—రాజా! నీకెల యంబుల సహాయకారినై, ఎట్టి శాత్రవునైన నెది
రింపగల యరిభయంకర దీర్ఘుఁడు కర్ణుఁడు భవత్సన్నిధినుండ
నీవిటు చెల్వదక్కి చింతించుటకు కారణమేమి సంభవించినది.

గీ. పుడమిలవీరాధివీరుండు ♦ వృషవిముండ
యేలయిటు చెల్వదక్కి యుం ♦ టివి నృపాల?
రథగజతురంగములవి కొ ♦ అత నీకు
గల్గెనా లేక మరియేమి ♦ కారణంబొ
దెలుపవేడెద వచియింపు ♦ ధీరచరిత.

దుశ్శా—అగ్రజు నాజ్ఞాబద్ధసంకల్పుఁడైన దుర్వార పరాక్రమోపేతు
డైన దుశ్శాసనదుష్టసింహుఁడు తావకీ సాన్నిధ్యమునను౦డ నీకీ
మనః చింతయేల నగ్రజా!

దుర్యో—మాతులా! నీతో నేనేమని చెప్పుదును.

గీ. రథగజతురంగములవీ కొ ♦ అంత లేవు
ధనకనకరత్నభూషలా ♦ ధరణిగలవు
ఎన్నియున్నను కాని నీ ♦ తేని సుఖము
యున్నదా? ఆత్మహాని రా ♦ నున్నయిపుడు.

శకు—నాయనా! సుయోధనా! ఆత్మహాని రానుండుటేమి? నాకీ
మియు దోపకున్నది. నీవిచారకారణము వివులముగఁ దెల్పి
సామనస్సందేహముఁ దీర్పుము. నీవిచారము మానుము.

కర్ణ—రాజా! దుర్యోధనా! సర్వసర్వంసహాచక్రంబు బరిపాలనము సేయు మహాచక్రవర్తివి. నీకుహాని రానున్నదియా? దానికి నీవు విచారింపుచుంటివా? మహారాజువు నీకుహాని యొనర్చునంతటి శూరుండెవ్వండుగలండు, వట్టిది. నీవు మాత్రము ధృతి వహింపుము.

ఉ. భూరిపరాక్రమంబునను, స ♦ ముజ్జ్వలశూరుఁడు కర్ణుఁడే భవద్
భారము బాపుచుండ కడు ♦ వాక్యప్రవీణుఁడు భవ్యమాతులుం
డేరణయోజఁ జెల్పుచు, త్వ ♦ దీయసుఖంబునెఁ గోరియుండ, నీ
కీసునచింతబొందెదె? సు ♦ ధీవరపూజకా సుయోధనా!

దుర్యో—మామా! రాధేయా! మీరలెంత అమాయకులై పోతిరయా! నావిచారమునకు కారణము గ్రహింపలేకపోతిరిగదా! అయ్యది నే మీకు దెల్పవలయునా? లోకత్రయము దెల్పుట లేదా? అయ్యది నాకొక్కనికి మాత్రమే విచారకారణము గాదు. మీకెల్లరకు సమానము జనింపవలసిన కారణమే? మాతులా! నిరంతరమదీయశాత్రవమానసబాధకులైన పాండవుల ప్రాభవైశ్వర్యముల కనులారాఁ గాంచితివిగదా! రాధేయా! వినుచుంటివా? లేదా? నిజముగు మానవంతులగు మనవంటి సుక్షత్రియశూరాగ్రేసరులకు హృదయగతశల్యముల కావాయని నేను మీకు వచింపవలయునా?

సీ. ఎన్నఁడుగనివిని ♦ యెఱుఁగని మణిసభ
పాండుపుత్రులచేత ♦ బడుటఁగనరె?
రాజాధిరాజులై ♦ రహి వారివశ్యులై
ఎనలేనిధనముల ♦ ర్పింపవినరె?
చతురంబ్ధివలయిత ♦ క్షితితలేశ్వరులెల్ల
కప్పముల్ భయపడి ♦ కట్టినారు

మణిహేమరత్నభూ ♦ షణములాయువికుప్ప
కుప్పలుగా నిల్లు ♦ గప్పెనంట

గీ. అఖిలమునునున్నవంటపాం ♦ డవులయశము
లోకత్రయమెల్లనిండంగ ♦ లోకులెల్ల
చెప్పుకొనుచుండ మీకు నే ♦ జెప్పనేల?
మామ! యెటువిసహియింతు ♦ మనుజశనయి.

శకు—ఓహో! నాయనా! అదియా నీయసూయకారణము. నే గ్రహింపనైతినయా రాజా! నీకు ఒక్కనికే కాదు. మీకుమిక్కిలి రాజైనవానికి ప్రీతివానికి నయ్యదివిన్న నసూయకారణమే?

కర్ణ—అసూయయని నెమ్మదిగ యనుచుంటిరా? నేను నయ్యదియే యిప్పుడు మీకుఁ జెప్పదలంచితిని కాని, మన దుర్యోధన రాజు చింత యియ్యదియేయని గ్రహింపనైతి.

దుర్యో—మామా! వారొనర్చు రాజసూయముఁ దలంచిన నాహృదయంబునకు బల్లెముపోటువలె నున్నది. అవబృథస్నాతుండైన యుధిష్ఠిరుఁడు నారద పారాశర్యాది మహాఋషుల సమేతుండై సకల రాజరాజాధి సమేతుండై సింహాసనమున నధిష్ఠించి యుండ, భీమార్జునులు సముజ్జ్వలపరాక్రమోపేతులై యమనందనునకు తోడై యుండ నకుల సహదేవులు సహజసుగాత్రశూరులై అనన్యసోదరప్రేమగలవారలై యుధిష్ఠిరునకు చామరంబులువైవ, కృష్ణ దుష్టద్యుమ్నులు బాసటమైయుండ, సాత్యకి మహాక్తిఁగ పద్మాతపత్రంబుపట్ట ధౌమ్యుఁడు మఖమంత్రపఠనంబుసల్ప సామంతరాజులు కప్పములుఁగట్ట నావిభవసర్వస్వము నిజముఁగ మామా! నాహృదయగతశల్యములెసుమా? ఆపాండవుల నెల్లయుపకీర్తిఘటింపచేయవలయును నాకేమియు నపా

ముడు చెప్పవా? ఆరాజసూయ సమాప్తిదినము రేపు. అయ్యది భంగముసేయు నుపాయమాలోచింపుము.

దుశ్శా—మామా! అదేమి మాయయోకాని, నాయన్నయు నేనును వారికెట్లయిన నపకీర్తిఘటింపఁజేయవలయు నని ఎంతయో ప్రయత్నించి సకల ధనంబుల సంగ్రహించిరను, వారికి పునఃతిరిగి ధనము లభించుచున్నది పాండవేయుల యైశ్వర్యము లెటులైనను హరించి, ప్రాప్తమానటులజేసి, వారికి తలవంపులు గల్గునటుల యోచనచేయుము.

దుర్యో—మామా! ఊరకనిలుచుంటివేల? మేనల్లుని అవమానాగ్నిచే జచ్చుమనియా? చెప్పుచుంటివి. నీవునాకోర్కె దీర్పలేవా?

కర్ణు—మహారాజుకోర్కె పాండవ సమస్తైశ్వర్యముల నపహరించుట, రెండవది శ్రీకృష్ణునకు తలవంపులు ఘటింపఁజేసి రాజసూయయాగము నిష్ఫలము చేయుట, ఆలోచించెదవేల?

శకు—వత్సా! సుయోధనా! ఇంత స్వల్పకార్యమునకు, నీవు విచారింపనేల? శ్రీకృష్ణునకు మహావమానము ప్రాప్తింప జేయవలెననినచో, క్షణములో కొనసాగును. ఏమందువేని, మన శిశుపాలునకు ఆగల్లగోల్లఁకు ప్రబలవిరోధి, రాజసూయయాగము రేపటితో సమాప్తమౌను. ఏదైన సమయమునఁ గేశవునకు తప్పక పాండవు లర్ఘ్యంబొసంగుదురు. అప్పట్టున మన శిశుపాలుని దగిలిపించిన తప్పకవమానము పాలుజేయగలఁడు. శిశుపాలుని తప్పులు నూరింటివఱకు క్షమించుమని యాదవులకు శాపముగలదు. ఒకవేళ గోపాల శిశుపాలురకు యుద్ధమే సంభవించిన యెడల మనమెల్లరము చైద్యుని పక్షముఁజేరి పోరుదము.

దుర్యో—మామా! ఆచైద్యునీ కర్తవ్యమునకై నీవె పురికొల్పవల
యును.

కర్ణు—పొగడియో నెగడియో లంచమిచ్చియో లాలనచేసియో,
తప్పక నాశిశుపాలుని ఈకర్తవ్యమునకై నియోగించి పంప
వలయును. మనమెల్లరము నాతనికి సాసటమై శిశుపాలుని
పక్షమే చేరి ఆతఁడు ఒకమాటయన్న మనము కొండు సమిధలు
పైగా వేసి కృష్ణుని తప్పక వధింపవలయును.

దుశ్శా—మాతులా! కొండనకోర్కె—అనగా, పాండవైశ్వర్యముల
మాపాలబడుటయెట్లు?

దుర్యో—మామా! నాద్వితీయ సంకల్పమే కొనసాగిన నీమేలు మఱు
వను. నేనెంతప్రయత్నించి ఎంత యుపాయముసల్పి వారిధన
కనకవస్తు వాహనముల హరించినను అదేమి చిత్రమోకాని,
మామా! ప్రభాతంబు నప్పటికన్ని భోగములు క్రిమ్మఱనైశ్వ
ర్యము గల్గుచునేయున్నవి. నేఁడు నీయూహావిశేషమున, నికఁ
ము పాండవులరణ్యానుల పాలౌదురని నమ్ముచున్నాను. ఊహిం
చిన నట్టి సంకల్పమే యూహించవలయును ప్రథమ ప్రయ
త్నమునకా శిశుపాలుని, నియమించిన కృష్ణున కర్ఘ్యంబొసంగ
నున్నతరి దాశార్హుండు పూజార్హుండుగాడు చోరుఁడు అని
దూషించి మన శిశుపాలుఁడు తప్పక వానిని వంచించి తీరును.
ఆతని నీప్రయత్నమునకు యిప్పుఁడేపోయి, పొగడియో,
పూజించియో, లంచమిచ్చియో పంపుదము. ద్వితీయ ప్రయ
త్నపుటూహ విషయమేమఁదువో వచింపుము.

కర్ణు—రాజా! సహజవంచైక నిధానసుండును. కపటయోచనాప్రభావ
బుద్ధిశాలియునగు, నిశకుని, ఆమాత్రపుటూహ సల్పలేక
పోవునా? పాండవుల సమస్తైశ్వర్యములు నీకరతలంబున పోయ

కపోవునా? మణిసభకు పాండవులను దూరముచేయక మిన్న
కుండునా? యేదద్ సభకు నిన్ను నిజాస్థానికేయుడా? నీకెం
దులకీ విచారము. అంతయు మీ మామపైననే భారము
వేయుము.

దుర్యో—మామా! అలచించిన భీష్మద్రోణాదులువచ్చి మన యాలో
చనను భంగము గావింతురు.

సుయోధనా! అయ్యది రాజసూయానంతరమునగాని సిద్ధిం
పదు. దానికి, నేనొక్కకపట దురోదరము తలంచితిని. నీవు
చింతింపవలదు.

దుర్యో—మాతులా! అంతయు నీదే బాధ్యత.

ఉ॥ ధారుణిపావకీ కపట ♦ దారప్రయోగముచేత వారినే
తీరున కట్టిపెట్టి యెటు ♦ దీతువో రాజ్యము, ద్రవ్యమెల్లయే
తీరు హరింతువో? భవ వి ♦ ధేయుని దుఃఖమునెట్లు బాపెదో
భారము నీదుబాహువుల ♦ పైనిడితిన్ వహియింపుమాతులా!

శకు—రాజా! సుయోధనా! నీకావిచారమువలదు. ఆసంకల్పము
రాజసూయానంతరమున నీకుఁ దెల్పెదము. రండు కొలువు
కూటమునకు పోవుదము.

దుర్యో—అట్లేపోయి రాజకీయ కార్యముల నిర్వర్తింతము రండు.

(అందరు నిష్క్రమింతురు.)



## 3 వ. రంగము.

### యజ్ఞశాల.

(యజ్ఞదీక్షితుఁడై ధర్మరాజు ఆతని తమ్ములు, ద్రౌపది, శ్రీకృష్ణుఁడు,
భీష్ముఁడు, దుర్యోధనుఁడు, కర్ణుఁడు, శిశుపాలుఁడు,
నారదుఁడు, ధౌమ్యుఁడు, మరికొందరు
రాజులుఋషులు ప్రవేశింతురు)

నార—(స్వగ) ఆహా! ఈసభావైభవమేమని బొగడుదును. సకల రాజాధిరాజులు సభనలంకరించియున్నారు. మహామునీశ్వరు లెల్లరు యజ్ఞమునకై వేచియున్నారు. పాండుపుత్రుల యశోల తాప్రసూన సౌరభము, లోకత్రయమునిండి పోయెనుగదా? నేఁడు రాజసూయయాగ సమాప్తదివసము. యోచించిచూడ యిప్పుడీ రాజసూయయాగ సమాప్తదినమున నొక్క లోక కంటకుఁడు కేశవహస్తంబున మడియనున్నటుల దోఁచుచున్నది. నాకు మహాసంతోషము. ఇప్పుడీ యజ్ఞశాల నలంకరించిన శూరాగ్రేసరుల మనఃబుల విద్వేషంబు గల్గునట్టుల, దో షు నందనుఁడైన ధర్మరాజుని నాలుగు మాటలచే బొగడి అన వ ద్యోదయుఁడనయ్యెదగాత! (ప్రకాశముగ) ధర్మపుత్రా! పూర్వ పూర్వజన్మ సుకృతఫలంబున, సుక్షత్రియసంజాత ప్ర పంచధర్మము నిల్పకంకణముఁ గట్టుకొన్నాఁడవు. నీయశో మింక భూమ్యాకాశపరివ్యాప్తమై రాజిల్లఁగలదు. ఇట్టి మహా రాజసూయయాగము - విద్వేషులును - క్షాత్రిరస్వభా త్యపరివర్తకులునునైన యన్యరాజులకు సాధ్యమానా? మఱియు

నిట్టి యపూర్వమఖంబు నెవ్వరును చేయుట నేవినియుండలేదు-
చూడలేదు. ఇక చూడబోను.

చ. ఎలమిని యిట్టిభూరిమఖ ♦ మొందును నేఁగనియుండలేదు నీ
చులకలుపాత్ములౌ నృపభులు ♦ శుభలఘుపట్టిననేమి? తావకీ
నలుగురుతమ్ములుం గనిరి ♦ నాల్గుభుజంబులయట్లయుండగా
కలిమిఁగడించితీరాగము సు ♦ ఖంబుఁగ సల్పితివ యజ్ఞ్య ధర్మజా.

అందును, యజ్ఞపతిప్రధాతయై, సకలభువనముఖ్యప్రార్థితుడై, దైవాంశసభూతఘనుండైన శ్రీమన్నారాయణుఁడు, శ్రీకృష్ణుండు నీకెల్లవిధంబులతోఁడునీడయై గారాబుచుట్టమై, మీకష్టసమితిహరింపగలవాఁడై, భారమువహించి సహాయకారియై యుండ నీయజ్ఞము పూర్తికాకబోవునా?

ధర్మ—మహాత్మా! నారదమునీంద్రా! పరమభాగవతోత్తములును, శాంతరసైకహృదయులును, దేవఋషివర్యులును నైన తమవంటి మునీశ్వరుల మహావాక్యము లమోఘములు. వేదవాక్యములు యజ్ఞకార్యక్రమంబుదెల్పుఁడు మీయానతి యాజకఋత్విక్సభాగురు ద్విజపూజనొనరించి ధన్యతగాంచెదను.

నార—ధర్మరాజా! ఆ విషయము గాంగేయుండు నీకుఁదెలుపగలఁడు.

భీష్మ—యుధిష్ఠిరా! నీకుఁదెలియని పూజార్హుండు మఱొకఁడుగలఁడే? నీయాజకఋత్విక్సభాగురుద్విజపూజ చేయుటకు యగ్రపూజార్హుఁడెట్టివాఁడనఁగా,

మత్త. కోకిల. స్నాతకుండును ఋత్విజుండును ♦ సద్గురుండును విష్ణుఁడు
న్భూతలేశుఁడు నేయుతుండును ♦ బూజనీయులువీరిలో
ప్రీతినెవ్వఁడు సద్గుణంబుల ♦ బెద్దయట్టి మహాత్ము ని
ఖ్యాతుఁ బూజితుఁ జేయ మొక్కట ని ♦ గౌరవాన్వయవర్ధనా!

ధర్మ—గాంగేయా!

గీ. స్నాతకుండుఁ బండితుండును ♦ సద్గురుండు
ఋత్విజుండు నిష్టుండును ♦ ఋజునృపతియు
యగ్రపూజార్హులౌను ర ♦ టంచుబల్క
హృదయ సందేహమదిపోయి ♦ ముదమగల్గె.

ఆర్యా అట్టి సద్గుణ సమన్వితులెందుగలరో? అయ్యాదికూడ వచించి నాసుఖ సంపూర్ణము జేయుము.

నార—యమనందనా! అసమాన శేముషీమనీషులైన శ్రీభీష్మబ్రహ్మచారియు—సహదేవుండును యజ్ఞపూజార్హుని నిర్ణయింప గలరు, వారు నిర్మించిన మహానుభావుండు లోకత్రియమునకు సమ్మతమే? అగ్రపూజార్హుండెవ్వండని యోజనల్పనేల? మన యొద్దనే ఆసీనుడై యున్నవాఁడు.

భీష్మ—ధర్మరాజా! ఈ నారదమునీంద్రుండు వచించినది నిజము. అగ్రపూజార్హుండింకే గలఁడు.

సీ. అబ్ధిదాగిన సో ♦ మకాసురుభంజించి
నిగమముల్ దెచ్చిన ♦ నేతయెవఁడో
యమృతాంధనులగావ ♦ యసురాధము లద్రుంచు
తాబేటిరూపంబు ♦ దాల్చెనెవఁడో
సూకరాకృతిఁదాల్చి ♦ లోకకంతకుడైన
స్వర్ణాక్షుఁగూల్చిన ♦ స్వామియెవఁడో
ప్రహ్లాదుఁగాపాడ ♦ ప్రబల సింహాకృతిఁ
బరిసుతుమున్నిన ♦ దేవుఁడెవఁడో

గీ. వామనుండైన ఘనసార్వభౌముఁడెవఁడో
పరశురాముఁడై యెసట్టి ♦ ప్రభువెవఁడో
రావణునిఁ గూల్చినట్టి (శ్రీ) ♦ రాముఁడెవఁడో
యట్టి గోపాలబాలుఁడు ♦ మధిపనేఁడు.

నార—శమనాత్మజా! నిజము నాలోచింప నీయజ్ఞ పూజార్హుఁడు భీష్ముఁడు వచించునటుల కృష్ణుఁడేతప్ప యన్యులు పూజార్హు లౌదురా?

సీ. రోదసీకుహరంబు ♦ రుచిరాంశుతతిఁ జేసి
యర్కుండు వెలిఁగించు ♦ నట్టులమృత
సందోహనిష్యంద ♦ చంద్రికఁ జేసి శీ
తాంశుఁ డానందించు ♦ నట్టు సకల
జనులకుఁ దనదైన ♦ సదమలద్యుతిఁ జేసి
తనరంగఁ దేజంబు ♦ తనకుఁ దాన
చేయుచున్న స ♦ త్స్వరూపుండు పుండరీ
కాక్షుండు కృష్ణుఁడ ♦ నాదినిధనుఁ

గీ. డబ్జనాభుఁడుండ ♦ నర్ఘ్యంబుఁ గొనఁగ నిం
దార్హులౌరులుఁ గలరె ♦ యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు ♦ నచ్యుతుఁ బూజింపు
మధిపయదియ చూవె ♦ యజ్ఞఫలము.

సహ—తాతా! గాంగేయా! నారదఋషీంద్రా! లెస్సగఁ జింతించి నారు. సుజ్ఞానులవాక్యములం దమృతంబుండునే సభాసదులారా! సర్వశక్తుఁడును సర్వపోషకుఁడును, సర్వకారుణ్యుఁడును అయిన సర్వేశ్వరుఁడే పూజార్హుఁడని వచించు భీష్ముని తీర్మానము నేను బలపరుచుచున్నాను.

ఉ. ఎవని కృపావిశేషమున ♦ నెల్లజగంబులు నిల్చియుండెనో
ఎవఁడు యనుగ్రహింపనివో ♦ నెల్లజగంబులు కూలిపోవునో
ఎవఁడు జగంబు, కాలమని ♦ యెవ్వఁడు, దైవమెవండు, సర్వమూ
ఒనడయి యెల్లచుండెనో, య ♦ హీస్థలి యాతఁడు కృష్ణుఁడే సుమీ

అన్నయ్యా! భీష్మబ్రహ్మచారి తెలుపునట్లు మన గేశవుఁడే పూజా
ర్హుఁడు. అతనిపూజించుట త్రిలోకజనసమ్మతము.

ధర్మ—తాతా! శాంతనవా! అవశ్య మట్లొనరించి కృతార్థుఁడ నయ్యెద

ధౌమ్యు—ధర్మరాజా! అర్ఘ్యోదకము గోపాలున కొసంగుము.

ధర్మ—(అర్ఘ్యము కృష్ణున కిచ్చుచున్నాఁడు)

శిశు—ధర్మజా! ఆఁగు మాఁగుము. అర్ఘ్యమునకు దాశార్హుఁ డర్హుఁడని
యే యిచ్చియుంటివా? లేక నీ మేనబావయనియు, కష్టము ల
యందు రక్షించెఁడి పరమమిత్రుఁడని యొసఁగియుంటివా?
ఆహా! ఏమికాలము వచ్చినదయా? దురుకాలము. ఈమహా
సభలో బహువిధ తపోవ్రత నియమశీలురు—సమసైశ్వర్య మ
హాశక్తిధరులు, దిగంత విశ్రాంత యశశ్చంద్రికా విరాజితు
లగు మహాప్రభువులు—భూరిగుణ సంపన్నులు—మహాసత్వగరి
ష్ఠులు—సమస్త లోకారాధ్యులై—నిగమాదికారులై—ధుర్యు
లై—శూరులై—బుద్ధిశాలులై—మహాప్రతిభావరులై—శస్త్రా
స్త్రవిద్యాధురీణులరై—వేనవేలు సభాసదులు సభనలంకరించి
యుండ నీవృద్ధమర్కటమునకు గోపాలు డర్చనీయుండని యే
దోఁచెనా? నీకా వృద్ధమర్కటము మార్గదర్శకమా? బాపురే!
ధర్మరాజా! నీనామమునకు తగినటువంటి—నీ పూర్వరాజ
సూయయాగమునకు తగినటువంటి నీయర్ఘ్యమునకు తగిన
స్నాతకుఁడే లభించెను. ఎంత యవివేకుండవైతివయా!

మ. అవనీంద్రులనేకులుండఁగ విశి ♦ ష్టాచార్యులార్యుల్మహా
దివిజుల్పూజ్యులు పల్వురుండఁగ ధరి ♦ త్రీనాథ గాంగేయ దు
ర్వ్యవసాయంబున కృష్ణుఁ గష్టచరితు ♦ న్వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు దా ♦ శార్హుండు పూజార్హుఁడే.

ధర్మరాజా యతని నామము నేఁడు నీయవివేకంబున నేతిబీరవలె వ్యర్థమై, యర్థములేనిదై, నిస్సారమై సకలజనవంచకమైనది. జరావస్థయందున్న భీష్ముఁడు మతిలేక, యుపవాదించిన తీర్మానము—కలహభోక్తయైన నారదఋషి బలపరచుటయు. స్నేహపక్షపాతివై — కావలసిన బంధువుఁగదా యని నీవును బేలవై యీకుటిల గోపాలునకు నర్ఘ్యంబొసంగితివి. అంతియేకదా! వెఱ్ఱి ధర్మరాజా! ఈ పసుల కాపరియైన నల్లగొల్లని యందేయుత్కృష్టత గలదని యర్చించితివి?

సీ. ఈతండువృద్ధని ♦ యెఱిఁగిపూజించితే
వసుదేవుఁడుండఁగ ♦ వసుమతీశ!
ఋత్విజుండని విచా ♦ రించి పూజించితే
ద్వైపాయనుండుండ ♦ ధర్మయుక్తి
నాచార్యుఁడని విన ♦ యమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుఁడు ♦ కృపుఁడునుండ
భూనాథుఁడని మెచ్చు ♦ బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే ♦ యవనిలోనఁ

గీ. బూజనీయులైన ♦ పురుషులలోపల
నెవ్వఁడయ్యె గృష్ణుఁ ♦ డిట్టులేల
పూజ్యులైనవారి ♦ పూజింపనొల్లక
భీష్మపలుకుఁ జేసి ♦ బేలవైతి.

నిజముగ భీష్ముని పలుకు లనమ్మి దుర్మార్గుని పూజించుట నీకుకూడదు. జారచోరనిపుణులును దుర్మార్గులును, అజ్ఞానులును నయిన వారె పెద్దలౌదురనియు, ధర్మోపన్యాసకులగుదురనియు, రాజ్యపాలకులౌదురనియు, భవిష్యత్పురాణంబున వ్యాసుఁడు వ్రాసిన యంశములెల్ల సత్యములై తీరినవి. మహానుభావుఁడు కవి

బ్రహ్మవ్రాతవ్యర్థమానే? యుధిష్ఠిరా! ఇక నీకల్పకాలు శుష్క-ప్రియములు, నీయాగము నిరర్థకము. ఛీఛీ యిట్టినీచప్రాజ్యాధిదేశమందు నీతికోవిదులు నిల్వఁగూడదు. ప్రాజ్ఞులైన వారెల్లరు నీసభనుండి లేచిపోవుటయే యుక్తము. నాతో లేచి రాదలసిన ప్రాజ్ఞులు రావచ్చును. (అని సభనుండి వెలికి వచ్చుచున్నాడు.)

నార—(స్వ) కలహాగ్ని రగులుచున్నది. నేనీసమయమున రెండు సమిధలు వేసెదగాక! (ప్రకా) శిశుపాలమహారాజా! శ్రీకృష్ణు డర్చనీయుడని వచించిన నీభీష్మసహదేవ మనీషులు, బుద్ధివిహీనులనియేనా? నీయభిమతము. సర్వలోకారాధ్యుడైన సర్వేశ్వరు డర్చనీయుఁడేల గాకుండును?

శిశు—(నవ్వి) నారదా! వ్యాసమహాఋషి రచించిన భవిష్యత్పురాణ పఠనంబు చేసినవాడవలెనుంటివి. నీకును నల్లగొల్లనియందు పక్షపాతమేనా? గొల్లభామలగూడి వారియిండ్లలో వెన్న నపహరించి నీచకృత్యములకు లోనైనదొంగయూదప్పని పూజించుట నెట్టిదన,

క. చనఁ జేటికి దారక్రియ
యునుఁ జెవిటికి మధురగోష్ఠి యునుఁ జీకునక
త్యనుపమసురూపదర్శన
మును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించుటిలన్.

దురాచారుఁడును, దుర్మార్గుఁడునైన కృష్ణుని ధర్మరాజు పూజించుచుండ మాబోటి ప్రాజ్ఞులు నిల్వఁగూడదు. సుయోధనకర్ణభూపాలులారా! లెండు లెండు. మన మీసభను విడిచిపోవుట మేలు, లేకున్న పాపభూయిష్ఠమైన నీయాగమునం దిలకించిన

సహజసుకృతిస్వభావులమైన మనకుకూడ కలుషంబుముట్టు
కొనును.

(నడచుచున్నారు శకుని కర్ణ దుర్యోధనాదులుకూడ లేచుచున్నారు.)

ధర్మ—(శిశుపాలుని గూర్చుండబెట్టి) తమ్ముఁడా! శిశుపాల! ఉదార
గుణసమృద్ధుఁడవును, సహజశూరుండవును, లోకపాలుండవునై
న నీకీ పారుష్యముకూడను.

కం. భూరిగుణోన్నతులనదగు
వారికిధీరులకు ధరణీ ♦ వల్లభులకు వా
క్పారుష్యమునను నె మహా
దారుణమిదివిషముకంటె ♦ దహనముకంటెన్.

సకలచరాచరములకు మూలకారకుఁడును, ఆదిమధ్యాంతరహితుఁడును
నైన శ్రీకృష్ణపరమాత్మునిటు యర్చించుమని చెప్పిన భీష్ము
నకు జక్కటులను దిద్దుచుంటివా?

ఉ. ఆదిజుడైన బ్రహ్మయుద ♦ యంబున కాస్పదమైనవాఁడు వే
దాదిసమస్తవాఙ్మయము ♦ లందు బ్రకాశితుఁడైనవాఁడు లో
కాదిత్రిలోకపూజ్యుఁడని ♦ యాత్మనెతిగిపితామహుండు దా
మోదరుఁ జెప్పె పూజ్యుఁడని ♦ యుక్తమకాకిది యేమిదోసమా.

సాత్వతేయా! యుక్తాయుక్తజ్ఞానశూన్యుండవై—పరమాత్ముఁడు బూజ
నీయుఁడు కాదని నీసహచరులను "విడువుఁడుసభ" యని బ్రో
త్సాహపర్చి, ముఖ్యబంధు వర్గములోనివాడవును నాకు సోద
రుఁడవునైన నీవే సంగ్రామమునకు సిద్ధపడిన, నీకు విజయము
ఘటింప నెవరుదీవింతురు. పరాత్పరుడైన శ్రీకృష్ణునే దూ
షించిన నీకు జయముకాదు. నీపట్టుదల—నీవాక్పారుష్యము—
నీయహంకారము మానుము. పెద్దల నవమానించుట కూడని

పని. పెద్దలు నిర్మించిన నర్చుతుడర్చుతుఁడు గాదన నీకు చెల్లునా? నీవింత రద్దికి బూనుకొని సేయుట హితవగునా?

క. గురుఁడని సమస్త లోకో
త్తరుఁడని నీకంటె వృద్ధతములైన నరే
శ్వరు లచ్యుతుడర్చితుఁడని
కరమభినందింప నీకు గాదననగునే.

భీష్మ—శమనతనయా! సహజకూ్రర స్వభావులును—కలుషార్జిత మానసులును నైన కపటపురుషులకు నీవంటి ధర్మరాజుని ధర్మనీతి, విన కర్ణములు దెరుతురా? నీశాంతహితము వారికి హితమగునా? ఈదమఘోషతనయుండు సత్యము నీమఖమునకు విఘ్నముచేయఁదలంచి వచ్చినట్లున్నాఁడు, పాపాత్ముఁడు. దుష్టుఁడు వీనికి శాంతవచనములు రుచింపవు.

ఉ. ఆరయ నీదురాత్ముఁడు మఖంబున విఘ్నముసేయ నీసభన్
జేరెనుఁగానిచో నిటుల ♦ శ్రీహరిపూజ్యుఁడుఁ గాడటంచు బాఘోరవచోక్తు లన్పలికి ♦ ఘోరముసేయ దలంచుబోఁడు పే్రమారసమొప్ప వేడతగు ♦ నా దురితాత్ముని వీని ధర్మజా!

రాగద్వేష పరిభూతమనస్కుండగు దుండగుఁడు, చెనటిచైద్యునకు ధర్మనీతి బోధించుచుంటివా? వలదువలదు. ఈసదనంబునం గల సదస్యులెల్లరు సంతోషభరితులై సమ్మతించియుండ నీతనికా తీర్మానము కంటకమయ్యెనా? దుర్మార్గులు రంధ్రాన్వేషణాస్వభావులు ఈశిశుపాలుడా జట్టులోనివాఁడే? సామవాక్యము లీతనికి రుచింపవు.

ఉ. పాలిత దుర్ణయుండు శిశు ♦ పాలుఁడు బాలుఁడు వీనినేల పాలక నీవు మెట్టువరు ♦ పగ మటిధర్ములెఱుంగ వీనికిం

బాలునె రాగకోపపరి ♦ భూతమనస్కుని కల్పరాజ్యల
క్ష్మీలలనాధ బుద్ధికని ♦ మిత్రమహాత్వరివాద శీలికిన్.

ఓయి ! చైద్యా ! మిథ్యాచారపరాయణా ! కేవలక్రూరస్వభావుడవై, దాశార్హుండు పూజార్హుండు గాడని దైవదూషణముసల్పి, నీ నీచబుద్ధి బయట పరచితివి నీతోనెక్కువ ప్రసంగము సేయ నేకూడదు. కాని నీనుక్కుప్రలాపములచూస్వ చెప్పుచుంటిని. ఈసభాసదులెల్లరు దామోదరు నర్చనంబున కంగీకరించి మారు పల్కకయుండ నీవు వారికంటె నెక్కువవాడవా ?

చ. అవినయబుద్ధివై హరికి ♦ నర్ఘ్యమయోగ్యమయంటి వీవు మూ
ర్ఖవు శిశుపాల ! యింకబలు ♦ కన్ వలయున్ సభలోననున్న యీ
యవనిపులెల్ల నాతని ద ♦ యంబరి ముక్తులువానిచేత నా
హవజితులుం దదీయశర ♦ ణార్థులుగా కొరులయ్య చెప్పుమా.

యాదవుడగు మాధవుని పూజసేయుడుగాడనుచుంటివి. ఉత్తమజ్ఞానము గలవాడు ఎవ్వడేని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వివక్షతుడుకాడు. ఉత్తమజ్ఞాన బ్రాహ్మణుడని దలంపుము. మరియు వృద్ధులలోనేమి బాలురలోనేమి ఎవ్వని కుత్తమజ్ఞానముగలదో వాడేఅర్చ్యసేయుడు.

క. వృద్ధులలోకలక్షయున్నను
బుద్ధిమె యెవ్వరికివారి ♦ బూజింపంగా
నిద్ధరణీశులలోగున
వృద్ధనిఁబూజించితిమిశ్రి ♦ వికర్మముభక్తిన్.

యింతమంది సభాసదులలో నీవొకరుడవు మాధవునిపై ద్వేషంబుని నిట్లు నతనివచింపబూనిన ఛీయని నెల్లరు నిన్నునిందసేయరా? ఏదీ? సంకర్షణుని కర్ఘ్యంబొసగుట కంగీకరింపని మరొకసభ్యుని వ్రేల్మడచిచూపింపుము.

శిశు—ఓరీవృద్ధవటుఁడా! ఏమి ధర్మోపన్యాసము సల్పుచుంటివి. నీధ
ర్మోపన్యాసము నీవంటిజ్ఞానశూన్యులును వృద్ధులునయినవారు
శ్రవణానందముగ నాలకింతురు అంతియె కాని నాబోటివారు
నకది కర్ణకఠోరము.

అనుబంధము 8.

ఈనల్లగొల్లని పరాక్రమము నేనెఱుంగనా? ఏ మాయమర్మముల
చేతనో ఏనలుగురనో చంపినమాత్రమున శూరుఁడగునా?
వృథామాటలతో గోపాలుం డిట్లేయుండనియు యిమ్మఖపూజా
ర్హుండనియు పొగడదగునా?

ఉ. జారుఁడు చోరుఁడున్మరియు ♦ శౌర్యవిహీనుఁడు దుర్మదాంధుఁడున్
భీరువునున్ దురాత్ముఁడును ♦ నింద్యుఁడు దూర్తుఁడు ఘోరపాపుఁడున్
ధారుణిసత్యహీనుఁడును ♦ దాజపుడున్ కులగోత్రహీనుఁడున్
క్రూరుఁడు నాస్తికుండనుచు ♦ క్షోణిజనంబులు పల్కగాంచవే!

వెండియు నాగొల్లకాంతలు ముచ్చటించుకొను వాక్యములైన నెన్నఁ
డు వినియుండలేదా? శ్రీకృష్ణుఁడు మహాపాపి, చోరుఁడు, అస
త్యప్రవర్తకుఁడు కులగోత్రవిహీనుండని వేయిసార్లు ఈసభాస్థల
మున నిలువఁబడి గంటాపథముగా చెప్పగలను. మాధవుని
గుణములు గ్రహింపని సభ్యులు యీసదనంబునగల సదస్యుల
లో నీవును నారదుఁడును ఈపాండవులునుదప్ప మరొకరు కని
పించరు వృద్ధమర్కటమా! ఇఁక నీధర్మోపన్యాసమునకు స్వ
స్తి చెప్పుము.

ధౌమ్యు—కటకటా! నేడెట్టి దైవదూషణ వినగంటిని.

సహ—[కోపముతో లేచి] తాతా! మీరేల వృథావాగ్వాదము
సల్పెదరు—మూర్ఖుండగు చైద్యుని అటుగాదు, పూజింపవల
యును దుర్మార్గా! సాత్వతేయా! శ్రీకృష్ణుండు పూజార్హుం

డని సదస్యులెల్లరు సమ్మతించియుండ నీవు కాదనుచుంటివి. దామోదరుఁడు పూజార్హుఁడుగాదని వక్కాణించు నీశిరంబు పై మదీయ శౌర్యప్రతాపంబున యెడమపాదంబు దాండవ మాడింతు—నీనాలుక వేయిచీలికలుగాఁజేసి పక్షివితతి కాహారముఁ గావింతు. పౌరుషవంతులైన క్షత్రియవీరులు కొందరు నీకు సహాయమువచ్చిన రానిమ్ము. ఓక్షత్రియవీరులారా! ఈ సహదేవుని వాక్యములు మరొకసారి వినులారా వినుఁడు.

చ. ధరణి పితామహుండు మఖ ♦ ధర్మముఁ గేశవుఁ బూజసేయు టే
స్థిరమనిఁ దెల్ప శీఘ్రగతి ♦ చేసితిమిట్టుల యగ్రపూజ, యో
ధరణి నృపాలులార! యని ♦ తప్పని పేర్లెడి చైద్యభూధవుౕ
శిరమున వామపాదమిఁడి ♦ చెచ్చెర చేతు రణంబువానితోన్.

పౌరుషమున్నవీరులు నాతో బోరుఁడు లేదేని మాధవు పాదంబులకు దండప్రణామములు సల్పి మామఖంబు పూర్తిగావింపుఁడు. రండు. రణరంగమున నన్ను ఢీకొను శూరులు, రండు.

(అప్పుఁడు ఆకాశముపై నుండి పుష్పవర్షము గురియుచున్నది.)

అర్జు—సెహబాస్! సోదరా! వీరపురుషలక్షణములుఁగల పల్కులఁ బల్కితివి. ఆకాశముననుండి పుష్పవృష్టిగురియుచున్నది

శిశు—ఏమీ? అట్లైన చైద్యుండు దండివృద్ధుండై భండనమున మిమ్ము ఢీకొన సిద్ధుఁడైయున్నవాఁడు రండు. సేనాపతీ! సునీథా! శీఘ్రగతి మన సేనలను సిద్ధపరుచుము.

భీము—ఓరీ! క్రూరచైద్యా! పదరకుము. గదాపాత్రి ద్వితీయుండై భీముం డమిత పరాక్రమోపేతుఁడై యున్నవాఁడు రమ్ము. యుక్తాయుక్తజ్ఞాన విహీనుఁడవై భగవద్దూషణ సల్పిన, నీ నాలుక వేయిచీలుకలుఁగా చీల్చి యిదివఱకు నిన్ను కాలుని

సన్నిధికి బంపియేయుందును. కాని యాగశాలయందు సమర
ము కూడదని యూరకొంటిని రమ్ము ఆకనవుడు బహిరంగ
ప్రదేశమునకు పోవుదము.

(అని లేచుచున్నాఁడు.)

భీష్మ—ప్రభంజనాత్మజా! శాంతము వహింపుము ఇప్పుడీ సాత్వతే
యుని గర్వమడంచు ప్రతిభాశాలి యొకండుఁ గలఁడు.

ధర్మ—(భయసంభ్రమములతో) పితామహా! యిప్పుడీ సంక్షోభకార
ణమున మఖమునకు విఘ్నముగల్గునని భయము ఘటించుచు
న్నది. ఏమిశలవు? ఏదిదారి? ఎట్లయిన తాతా! రాజసూయ
యాగము విఘ్నము కాకుండ రక్షింపవలెను.

భీష్మ—కుమారా! ధర్మరాజా! నీమఖము నిర్విఘ్నముఁగా నెరవేర
గలదు. నవనరక్షకుఁడు శ్రీకృష్ణుండుండ నీకు భయమేల కలుఁ
గవలయును.

క. నీయజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు ♦ జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁడ,
జేయుపరాక్రముఁడు దీనిఁ ♦ జేకొనికావఁగ.

ఇప్పుఁ డీయజ్ఞభంగమునల్పు శిశుపాలుని హతమార్చు వంతు
మాధవునదే, శతాపరాధములు నిండినవి. వాసుదేవుఁ డిపుఁడే
చైద్యుని హతమార్పఁగలఁడు.

శిశు—ఓరీ! పసులకాపరీ! నన్నుఁ జంపువాఁడవు నీవా? నీయనన్య
శూరత్వమునకు ఈశిశుపాలుఁడా వెఱచువాఁడు. గొల్లభామ
లను ఆవెఱ్ఱిగొల్ల కుఱ్ఱలను భయపెట్టుము. మామకీకరవాల
మునకు నీవననెంత. నీకోపము, నీపరాక్రమము—నీశూరత్వము
నెఱుఁగనివాను లేరనియే చెప్పవచ్చును—యెవ్వతియో యొక

ఆఁడుది పూతనయనుదాని జంపినమాత్రమున శూరుండవైతి
వా? గొల్లభామల చీరల నపహరించి వారి వెన్న దొంగిలించి
నంతమాత్రమున నే మహాబలవంతుఁడవైతివా? తుచ్ఛా! నీబ
లం బెంత? నీపెంత? నన్ను జయించు టెంత?

గీ. చండతర ఖడ్గమిదియె హ ♦ స్తమునఁ గలదు
కల్కులవియేల పెక్కులు ♦ ఖండనమున
నిలువరా తుచ్ఛ! నీప్రాణ ♦ ములుహరించి
ఘనుఁడు శిశుపాలుఁడను కీర్తి ♦ గాంచువాఁడ.

కృ—(లేచి) ఓసభాసదులారా!

ఉ. క్రూరుఁడు ఘోరదూర్తుఁడును ♦ కోపస్వభావుఁడు వీఁడు యేవిధిన్
దూరుచునున్న వాఁడొ నను ♦ దుర్మదమూని సభాస్థలంబునన్
సైరణ జేయ నేలనిక ♦ చాలును, వీని శతాపరాధముల్
దీరెను నాప్రతిజ్ఞ కడు ♦ దీరెను వీనికి సౌఖ్యమిద్ధరన్.

కావున వీని మదమిప్పుడే యణంచెదను. ఓరీ! చైద్యా! మిథ్యాచార
పరాయణా! యిదే మదీయ చక్రాయుధ ప్రయోగముచే నీ
శిరంబు ద్రుంచి భూభారంబు మాన్పెద. రమ్ము.

అనుబంధము 9.

శిశు — ఓరీ! పశువా! ఏమిరా? ప్రేలుచుంటివి. నీసుదర్శనాభిఘాతంబు
నకు తగిన ప్రచండఖడ్గరాజముగలదు! తుచ్ఛా నీసుదర్శనచ
క్రము వెఱ్ఱిగొల్లలపై ప్రయోగించుము. ఓరీ! గొల్లబోయడా!
నీవా నాప్రాణములను గూల్చువాఁడవు. నీవుకాదు నన్ను
పుట్టించిన బ్రహ్మతరమానటరా? నీచ!

అనుబంధము 10.

ఉ. కటుతరబాహుశాలి శిశు ♦ పాలుఁడు వీఁడు ధాతనేనియున్
చిటికెలో గూల్చజాలగల ♦ చివ్వభిలాష గలట్టివాఁడు నీ

ఎటుల యొనర్తు వైర రణ ♦ మేవిధినిల్తువు రాక, మూఢ నా!
తటుకున నిన్నుఁగూల్చి ధర ♦ దగ్ధమొనర్తు మఖంబునవ్వగన్.
సాక్షి! రమ్ము! శిశుపాలుని ప్రచండఖడ్గ ప్రభావము చవి చూపెదను.

ఉ. అవమాన్యైక సభలోన మాన్యుఁడని సా ♦ మాగంబున గౌరవ
స్థవిరప్రేరణ నిన్ను బాండుతనయుల్ ♦ దప్పుగఁ బూజించి ర
య్యవివేకాస్పదులైన పాండవులు, మోహాంధుండు భీష్ముండుఁ గే
శవ నీవుంగడఁగుండు నాకు నెదురై ♦ సంగ్రామరంగంబునన్.

మీ రెల్లరుకూఁడ సంగ్రామరంగంబున నన్ను గెల్వఁబోండు. రండు.
గొల్లబోయఁడా! చూచెద వేల? రమ్ము.

[కృష్ణునిమీదికి బోవుచున్నాఁడు.]

కృ—ఓరీ దామఘోషా! అన్యాయముఁగ నీ సభాస్థలమున గాంగేయు
ని దూషించి, నాకు తలవాఁపులు ఘటింపచేయవలెనను య
హంభావమున నన్ను నిందించిన పాపఫలమిదె గాంచుము.

[అని చక్రమును ప్రయోగించుచున్నాఁడు.]

శిశు—హా! హా! భయంకరము. భయంకరము.

[చక్రము శిశుపాలుని శిరంబు ఛేదించును ఆకసమునుండి
పుష్పవృష్టి కురియుచున్నది.]

తెర పడును.

తృతీయాంకము సంపూర్ణము.

---



ఓం

# ద్రౌపదీవస్త్రాపహరణము.



## చతుర్థాంకము.

---

### రాజమందిరము, దర్బారు.

(ధృతరాష్ట్రుఁడు, భీష్ముఁడు, ద్రోణాచార్యుఁడు, కృపాచార్యుడు అశ్వద్థామ, కర్ణుఁడు మొదలయినవారు ప్రవేశింతురు)

ద్రోణు—మహారాజా! ఆరాజసూయయాగ విశేషములు కనులతో చూఁడవలయునేకాని, చెప్పనలవికాదు. రాజసూయావ్వరంబున నవభృథసమయంబునందు బ్రహ్మర్షి రాజర్షి లోకపాల పరివృతుండైన మహేంద్రుడునుంబోలె నున్న ధర్మరాజును—నారదపారాశర్యాది మహాముని సమేతుఁడయి ధౌమ్యుండశేషతీర్థజలంబుల నభిషిక్తుం జేసెను. అప్పుఁడా ధర్మగుణశీలుఁడైన యుధిష్ఠిరుఁడు దేవేంద్రునివలె కాన్పించెను. అప్పుడుసాత్యకి మౌక్తిక పద్మాత పత్రింబుపట్టెను. భీమార్జునులు చామరంబులువైచిరి. కృష్ణమాద్రేయ దుష్టద్యుమ్నులు అరిభయంకరులై యాగశాలయందు నిలువబడి సకల మహీపాలురకు భయంకరులై కాన్పించుచుండిరి. వేయిమాటలేల? నేకనులారా అట్టి యజ్ఞము చూఁడలేదు.

ధృత—ఆచార్యా! నాసహోదర తనయుండు ధర్మరాజు సహజ పితృ ప్రేమఁగలవాఁడుసుమా? పుత్రులు పుట్టగనే సంతోషమా? చూచితిరా నారదవచనంబుల విని రాజసూయయాగముఁజేసి పితౄణము దీర్చుకొన్నారు. పాండవులు మహాగుణవంతులు, పరాక్రమవంతులు, వారియాగము నిర్విఘ్నముఁ గాక యుండునా?

భీష్మ—మహీపాలా! పాండవులు నిజముగ నారాజసూయయాగముఁ జేసి జగత్కీర్తిగాంచి రనుటలో సందేహము లేదు.

క. ధరణిహరిశ్చంద్రుఁడు భా
సురయశుఁడయిచేసె రాజ ♦ సూయంబనియుం
సరిఁగాదనియే దలతును
సురుచిరవిభవమునఁబాండు ♦ సుతుయజ్ఞముతోఁ.

కర్ణ—(స్వగ) ఈభీష్మద్రోణాదులు ఎల్లకాలము పరులనుగ్గడించి పరుల శ్రేయమే గోరుచుందురు బ్రాహ్మణులకున్న బుద్ధిలక్షణమే యిది. యింక నీకృపాచార్యుల తరువాయి మహాత్మ్యమెరిగించు కాబోలును. చూచెదనుఁగాక!

ధృత—భూసురోత్తమా! ద్రోణాచార్యా! నాపాపఫలము చేతనట్టిప్రవర్తి రాజము చూచుటకు కన్నులు లేకపోయెను కాని, రాజాధిరాజు లెల్లరు పాండవుల వశమై వారుచెప్పినట్లెల్ల చేసిరా? ఏల వశ్యులు కాకుండును. మహాధర్మమూర్తి శాంతిమూర్తి. అతని సత్యాగ్రహంబు చేతనే వశ్యులైయుందురు.

కృపా—రాజా! కృష్ణమూర్తిదేయదుష్టద్యుమ్నులు, భీమార్జునులు భయంకరులైయుండ పరరాజులు ఏలవశ్యులుఁగాకుందురు.

చ. కడుభయమందివానికి ద ♦ గం మతిపైవశ్యులపోనాకన్నెనా
పుడమినతిప్రసిద్ధులగు ♦ భూపతులెల్ల మహాధనావళుల్

దడయకఁ దెచ్చియిచ్చిరర ♦ దానముసేయుటఁ బార్థివత్వమే
ర్పడియెఁ బృథాగ్రపుత్త్రునకు ♦ బాండవతేజము పర్వనల్లచోఁ.

ఆ రాజు యశోలత సర్వప్రపంచము నిండిపోయెను.

అశ్వ—మహారాజా! అంబికేయా!

గీ. యజ్ఞదీక్షితుఁడైన ధ ♦ ర్మాత్మజునకు
గౌడకాంభోజపతులనే ♦ కప్రకార
వర్ణకంబళములు శుక ♦ వర్ణవాహ
నివహములుదెచ్చియిచ్చిరి ♦ నెమ్మితోడ.

కర్ణ—(స్వగ) ఆహా! భూసురులకు తగిన పొగడ్త లేయవి.

ధృత—ఆచార్యవరులారా! దురితాత్ముఁడైన శిశుపాలుఁడు శ్రీకృష్ణ దర్శనీయుండుగాడని మిథ్యావాదము సల్పితి నిజముగ వాని చావు దగ్గఱకు చేరబట్టియేసుమా?

కర్ణ—శిశుపాలుని చావునకేమిగాని? చావెన్నడైన నున్నదియే. నిజరణ శూరుఁడయి యుద్ధరంగమున నిల్చి మహాభయంకరుఁడై చైద్యుఁడు నిండుసభయందు శ్రీకృష్ణునితో బోరుసల్పినాఁడు. చైద్యుని వీరత్వము మనమెల్లరము పొగడవలసినదే?

అశ్వ—అన్యాయంబుగ భగవద్దూషణ మొనర్చిన మహాపాపి, చైద్యుని స్తుతింపవలయునా? క్రూరుని పొగడుటకు నీవంటివాడు కావలయుంగాని మావంటి వీరబ్రాహ్మణులు చైద్యుని పేరే తలంపరు.

భీష్మ—కర్ణా! నిండుసభయందు నన్నుఁగూడ నిందించిన క్రూరుని స్తుతింపమనుచుంటివా? ఏమి బుద్ధిశాలివయ్యా! రాధేయా!

[ప్రతిగామి ప్రవేశము.]

ప్రతి—మహారాజా! దుర్యోధనరాజుగారు జ్వరపీడితులై మిక్కిలి బాధపడుచున్నారు. వారియాజ్ఞగా దేవరవారిని తోడుకొని పోవచ్చితి.

ధృత—ఏమీ? అబ్బాయికి జ్వరమువచ్చినదా? ఆచార్యోత్తములారా! గాంగేయా! నేబోయి అబ్బాయికనపడి వచ్చెదను. మీరును దయసేయుడు.

[అందరు నిష్క్రమింతురు]

2. వ రంగము.

దుర్యోధనుని మందిరము.

(శకుని దుర్యోధనులు ప్రవేశింతురు.]

దుర్యో—(జ్వరముచే బాధపడుచుండును.)

శకుని—(శరీరముపట్టిచూచి) కుమారా! సుయోధనా! నీకీజ్వరమెచ్చట దాపురించినదయా! ఆహా! ఏమి జ్వరము? నాహస్తము సహితము కాగుచున్నది. అధికవేడికి తైలమర్ధన మొనర్తునా? (అట్లుచేయుచున్నాడు) తైలమర్ధన మొనర్చుటచే ఫాలమంతయు పొంగుచున్నది కాని, జ్వరతీవ్రము తగ్గునట్లు కనుపించడము లేదు. ఏదీ! దుర్యోధనా! కనుదృష్టి రుసు దెరసి నీమేనమామయగు శకునుని నన్ను ఒకసారి విలకించుము. నీతండ్రికి కబురుపంపితిని. ఆయన యిప్పుడే యిచటికి రాగలడు. నీశిర

ముపై ఈగాయమేమి? నీవిట్లు మనోవ్యాధికిలోనై చింతా
క్రాంతస్వాంతుడవై యుండుటకు కారణమేమి ?

గీ. ఇన్ని దినములయ్యె ♦ నేటికి నాతోడ
నిభపురేశపలుక ♦ విట్టులేల
నీముఖంబు దీర్ఘ ♦ నిశ్వాసధూమసం
హతులఁజేసి కలుష ♦ మయిన యదియు.

దుర్యో—మామా! ఇప్పట్టున నాసౌఖ్యము నిష్ఫలము నాగౌరవము
శూన్యము. నాజీవితమంతయు— నావిచారమునకుతోడు జ్వర
ముకూడ దాపురించినది. అబ్బా! ఏమి శిరోబాధ ! మామా!
వేయిగొడ్డళ్ళతో శిరము పగులవేసి నట్లున్నది. శరీరమున
జొన్నగింజవేసిన పేలగింజయగుచున్నది. తాపము హెచ్చుచు
న్నది. నాప్రాణములు పోవనున్నవి. ఇప్పట్టున ప్రాణముల
విడచుటయేమేలు. ఐశ్వర్యములేని దరిద్రునిబ్రతుకేల ? సౌఖ్య
ములేని జీవనమేల? నిష్ఫలము! నిష్ఫలము మామా! నాయీ
స్థితికి కారణమడుగుచుంటివా? నాబ్రదుకెందుకయా!

ఉ. ఏలికలేని రాజ్యరమ ♦ యింపగు సారములేనికైతయున్
పాలిటభర్తలేని మగు ♦ వామణిప్రాయము పుత్రసంతతిన్
క్రాలనిమందిరంబు, శశి ♦ కాంతిఁ జెలంగని రాత్రియున్ ధరన్
శ్రీలవిహీనుఁడౌజనుని ♦ క్షేమము సర్వము నిష్ఫలంసుమా?

మామా! వేయిసార్లు నీకు నేదెల్పవలయునా? ఆపాండుపుత్రులయశము
అట్టిలక్ష్మి, అటువంటిమయసభ, అబ్బబ్బా! పైగా నాకీజ్వర
బాధయేమి? శరీరము తాపావేశమున దగ్ధమగుచున్నది. శిరో
బాధ వేయిగొడ్డళ్ళతోఁ దలపగుల వేసినట్లున్నది. మామా!
నాగర్భమున నీవేదనమేమి? మాట్లాడుటకుఁగూడ ఓపికచాల
కున్నది. కన్నులు తిరుగుచున్నవి.

## అనుబంధము 11.

శకు—ఓహో! రాజా! పాండవరాజ్యవైభవదింతయేనా నిన్ను జ్వర పీడుతుని సల్పినది. నేనె తయజ్ఞానుడనైతినయా?

దుర్యో—నామనోవ్యాధికి మూలకారణము పాండవయైశ్వర్యము వీక్షించుటచేతనే? మామా! మొన్న నేకదానీవు "రాజసూయానంతరమున నీకాయుపాయము చెప్పెద"నంటివి. ఇంతలోనే మఱచితివా? మాతులా! నీవు నాకుఁ బరిత్రాతవు, నీవాక్యము నాకు వేదవాక్యము, నీమాటయే నాకు రాజశాసనము, నీపలుకులే నాకురత్నములమూటలు, నీతో సంభాషణమే నాకు దుఃఖనాశనహేతువు, నీతోస్నేహము నాకు నిక్కము మనోవ్యాధి నిర్మూలనౌషధము, నీమాటల నాలకించుటతోనే నాజ్వరము చాలామట్టుకు నశించినది. నీకన్న నాకాప్తులు లేరు. నాకు ప్రపంచమున తల్లివైననీవే? తండ్రివైననీవే? నీయూహావిశేషమే నన్ను ఆనందవారిధి నోలలాడించునని నమ్ముచున్నాను. నాయానందమే నీయానందము, నాయైశ్వర్యమే నీయైశ్వర్యము. పాండవుల యైశ్వర్యము వారి సత్కీర్తి విశేషించి నీకు నేఁదెల్పవలయునా? నీవును కనులారాగాంచియుంటివిగదా?

ఉ. ఈవునుఁజూచితట్టిసభ ♦ యొందునువినంబడ దేయుగంబులన్
భూవలయంబులోనదియ ♦ పూర్వముసర్వమనోజ్ఞమిష్టభో
గావహమేక్రియంబడసె ♦ నయ్యమహాత్ముఁడు దాననేమి సం
భావిత భాగ్యుఁడయ్యెను బ్రి ♦ భాకరతేజుఁడు ధర్మజుండిలన్.

గాంధారేయా! రాజసూయయాగముచేత వారు సత్కీర్తిఁబడసిరి. సకల రాజాధిరాజులు వారికి వశ్యులైరి. పాండవులకు దోసిలొగ్గి దాస్యముచేసిరి. నీవుచు కనులారా! గాంచితివిఁగదా?

అంతమను ఆశిశుపాలునిపైకి మాధవుఁడు ప్రయోగించెనా సమయమున యెవ్వఁడును, ఏమహీపాలుఁడును ఆతనికి అడ్డమయ్యెనకు బాస ట నిలువబఁడలేరి.

ఉ. యాదవు చేతిచక్రము భ ♦ యాకరమై శిశుపాలు మస్త క
చ్ఛేదముఁ జేసినన్ గడు వ ♦ సిద్ధులు శూరులునైన రాజు ల
య్యాదవుముందటన్ జయజ ♦ య ధ్వనులిచ్చిరిగాని వాని శౌ
ర్యోదయ వృత్తిఁగట్టి దుర ♦ నోపరు యెవ్వరు విక్రమింపఁగన్.

మేనత్తకుమారుఁడనియైన విచారింపక శిశుపాలుని శిరస్సుఛేదించిన మాధవు నేమనవలయు, అబ్బా! అధికముగ మాట్లాడ లేకుంటిని. శిరోబాధ ఎక్కువగుచున్నది. ఆపాండవుల రాజ్యలక్ష్మి నాహస్తగతమునం బడుట యెపుఁడు. నాకీ మనోవ్యాధి శమించుటెపుఁడు. ఆహా! పాండవుల ఐశ్వర్యము—పరాక్రమము యశము లోకత్రయము నిండిపోయినది. అయ్యది మామా! నాకు హృదయవేదనమును—అసమ్మతమును, అధికకోపమును గాకుండునా?

చ. అతుల పరాక్రమార్జితము ♦ లైన ధనంబుల పేర్మిఁ జేసియు
న్నతమగుచున్న పాండు నర ♦ నాథతనూజులలక్ష్మి నాకస
మ్మతమయిసూవెలింగెవిను ♦ మాతుల మానధనాఢ్యుఁడైన, భూ
పతిసహియింప నోపునె స ♦ పత్నులవృద్ధియు నాత్మహానియున్.

శకు—రాజా! కౌరవేంద్రా! దీనికై నివింత విచారమునకులోనై, శరీరమునకు మహావ్యాధి ప్రాప్తింపఁ జేసికొనుచు కృశించుచుంటివా ఎంతలో అధైర్యము పడితివయ్యా! నీవిట్లు అధైర్యపడి చింతింతువనియే మొన్ననీకు ఆయుపాయము చెప్పి మాయాదు రోదరముందు గల్పింతునని కూడ వచించియుంటిని అరనిమేష కాలములో నీకు పాండవైశ్వర్యము సర్వము లభించునట్లునేఁ

చేసెదను. నీవు ధైర్యమవలంబింపుము. నేఁ జెప్పినట్లెల్ల నీవు చేయుచుండుము. అదుగో మీతండ్రి ధృతరాష్ట్రుఁడు ఇటే వచ్చుచున్నాఁడు నీవు కప్పుకొని విశేషముగా కలవరించు చుండుము.

దుర్యో—సౌబలేయా! ఆపాండవుల యైశ్వర్యము ఏవిధముచేత హరింతునో? జూదమున వారి నెట్లుఁ గెలుతునో అంతయు బాధ్యత నీది.

శకుని—ఆధర్మరాజునకు జూదంబన మహాయిష్టము. నేనాతని తప్పక ఓడిపుచ్చెదను. నీతండ్రిని మాత్రము నీవు సమ్మతింపఁ జేయుము.

(ప్రాతిగామి, ధృతరాష్ట్రుని చేయిబట్టుకొని తీసుకొనివచ్చుచున్నాఁడు.)

ధృత—ఏడీ! మాఅబ్బాయి ఎందుపడుకొని యున్నాడు. నాయనా! దుర్యోధనా! పలుకవేమిరా? జ్వరము నిమ్మళించినదా?

శకు—బావా! జ్వరమేమియు తగ్గలేదు. శరీరమున జొన్నగింజవేసిన వేలగింజ యగుచున్నది మీదుమిక్కిలి శిరోబాధ-అధికతాపము విశేషముగా కలువరింపులు-చూడుఁడి. (ధృతరాష్ట్రుని చేయి పట్టుకొని దుర్యోధనుని శరీరముపై బెట్టుచున్నాఁడు.)

ధృత—అబ్బా! వీనిశరీరమెంత వేడిగానున్నది. నాయనా! గాంధారేయా! తైలమర్ధనమొనర్చుము.

శకు—బావగారూ! తైలమర్ధనమొనర్చుటచే ఫాలమంతయు పుండు పడిపోయినది. జ్వరమునకుతోడు శిరముపై గాయము చూచితిరా (చూపును) మహావైద్యుని సహితం రప్పించి చేతినాడి చూపించితిమి ఔషధసేవ జేయించితిమి కాని, జ్వరమూ యథా పథమునకు లోకొనుటలేదు. "ఇది ఒక విశేషమైన విచార మువలన గల్గినమనోవ్యాధి, ఈతని కావిచారముఁ దీరినగాని

మనోవ్యాధి శాంతింపదు. మందులు నిష్ఫలములు" అని ఆవైద్యమహాశయుఁడు చెప్పిపోయెను. మీదుమిక్కిలి నీకుమారుని విచారమునకు కారణమెద్దియో చెప్పఁడు. ఉలకడు. పలుకడు. కదలడు. ఈతని కా"విచారమే తీరని యెడల ప్రాణహాని"యని కూడ వైద్యుఁడు వచించిపోయెను.

ధృత—అబ్బాయీ! సుయోధనా! నీకీవ్యాధి ఏలగల్గినదయా! మాటాడవేమి నాయనా! నీకేదైన కొఱతగల్గినదా ఏమి? సకలైశ్వర్యములున్నవే నీకీవిచారమేల?

సీ. కౌరవైశ్వర్యంబు ♦ గౌరవంబున నమ
ర్పితమయ్యె నీయందు ♦ ప్రేమతోడ
ననుజులుమిత్రులు ♦ ననుచరులునునీకుఁ
బ్రీతులకానియ ♦ ప్రియులు లేరు
వివిధోపభోగముల్ ♦ దివిజేశునకుఁగల
యట్టులకలవు నీ ♦ కనుభవింప
సకలభూపతులుఁబొ ♦ యకభక్తియుక్తులై
యొలసినీపనుపునే ♦ యుదురు ప్రేమ

గీ. నేమిఁగొఱతయయ్యె ♦ నిట్లుఁడయ్యునాదను
ఛాయఁదఱిఁగియుండ ♦ సకలధరణి
రాజ్యభోగసుఖప ♦ రాఙ్ముఖత్వముఁబొంద
నేలనీకు గుఱకు ♦ లేశ్వరుండ.

చెప్పుము నాయనా! నీవిచారమునకు కారణమువచింపుము. అయ్యో నీశిరముపై గాయమేలగల్గెను. పలుకవేమోయి అబ్బాయీ! నీ తండ్రియగు ధృతరాష్ట్రునిపై కోపమా! నీవు పలుకకున్న నీ వృద్ధుఁడు జీవింపఁగలడా?

శకు—భావగారూ! నేనును ఎత ప్రార్థించిన కారణముమాత్రము చెప్పను. ఏవో కలువరింపులు "నాఘాతలంబునకు తగిలిన స్ఫటిక శిలాతలంబు దారిదారియని ప్రేలుచుంటివా? నవ్వుచుంటివా? నూతనసభాభవనమునాడి. నీదికాదు—నీభర్త లేప్రదియుగాదు—నేనాసభను చూడరాగా పరిహసింతురా దురాత్ములారా! దుష్టులారా." అని ఈవిధముగా నోటిపై కాయవేయకుండా ప్రతినిమేషము కలువరించుచున్నాడు. బాత్తిగాచిక్కిపోయినాడు. బొమికలు బయలుపడినవి. పట్టుకొనిచూడుము. అబ్బాయీ! భాగినేయా! ఈవచ్చినవారెవరు?

దుర్యో—(కలువరించును) ఓరీ! పాపాత్ముడా! భీమసేనా? నీవా? నీ భార్యతో నన్ను పరిహసింపవచ్చితివా? నాకంతటి వైభవము లేదనియా? చూడుము మీమీ ఐశ్వర్యముల క్షణకాలములో మారింతును. మిమ్ముల గానలపాలు గావింతును. అబ్బబ్బా! శిరోబాధ! తలపగిలిపోవుచున్నది. వేయిగొడ్డళ్ళతో తలపగుల వేసినట్లేయున్నది. తలతిరిగిపోవుచున్నది. నోటమాటరాకున్నది. తాకును ఏమీ? నేనుమిమ్ముల వంచింపలేకపోతినని నవ్వుచున్నారా! నవ్వకండి. అబ్బా! ఈశిరోబాధ ప్రాణముదీయుచున్నది. ఏదీ నానిశితకరవాలము. శిరోబాధభరింపజాలను. ప్రాణత్యాగము జేసుకొందును.

[లేచి కత్తి వెదుకుచున్నాడు.]

ధృత—నాయనా! నీకుపట్టినపిచ్చియినియా! నేను మీతండ్రిని కన్నుల దెరసిచూడుము.

శకు—బావగారూ! ప్రతినిమేషము యిట్లే కలువరింపుచున్నాడు. మనిషినిగుర్తుపట్టలేకపోవుచున్నాడు. నాయనా! సుయోధనా

ఈతఁడు మీతండ్రి! యింతగా బ్రతిమాలుచున్నాడు. నీవిచారము దీర్పఁగలఁడు కన్నులవిప్పిచూడుము.

ధృత—నాయనా! నీవు శిరోబాధకు సహింపలేక ప్రాణత్యాగముఁ జేసుకొన్న నే బ్రదుకగలనా? నీతండ్రిని నన్ను గుర్తింపుము. కన్నులదెరువుము. నీమనోభిప్రాయ మెద్దియో వచింపుము. తప్పక నెరవేర్చెదను. నామాట నమ్ముము.

దుర్యో—(లేచి) నాయనా! నీవా? ఆహా! ఎంతలో నాశిరోబాధ శాంతించినది. నాఅభిప్రాయమా? తండ్రీ! నావిచారకారణమా? అయ్యో నీవుమాత్రముఁ గ్రహింపనదియా? పాండవుల వైభవము నీకు కన్నులులేవు చూచుటకు, కాని వినియేయుంటివి. జనకా! ఏమిరత్నములు—ఎంతద్రవ్యములు కన్నులు మిరుమిట్లుఁ గొలుపుచున్నవి. లక్ష్మీగృహము— వర్ణనసేయ నాతరమా?

గీ. నన్ను రత్నపరిగ్రహ ♦ ణంబునందుఁ
బాండవుండు నియోగించె ♦ బార్థివేంద్ర
సర్వరత్నాకరైక ప్ర ♦ శస్తరత్న
పుంజముల కాస్పదము ధర్మ ♦ పుత్రుగృహము.

ఆ! దురాత్ములారా! నవ్వుచుంటివా? అబ్బా! మరలశిరోబాధ యధికమగుచున్నది. మతిపోవుచున్నది తల తిరుగుచున్నది. అబ్బబ్బా (క్రిందబడి పొర్లుచున్నాడు.)

ధృత—నాయనా! దుర్యోధనా! యిదేమివ్యాధిరా నీకు అయ్యయ్యో! మంచముపైనైనా పడుకొనరా? నాయనా! గాంధారేయా! అతని పట్టుకొని ఆమంచముపై పరుండబెట్టుము.

శకు —(అట్లుఁజేసి) బావగారూ! ఈతని మనోవ్యాధి కనిపెట్టితిరా?

దుర్యో—(కలవరించుచు) రమ్ము! ధర్మజా! జూదమునందు నన్ను గెల్వవము. యిదిగో ముంగుసారి. ఈపాదెను నీవు ఓడిపోతివి. నేనే గెల్చితి. [లేచి] అబ్బా! ఈశిరోబాధ నిద్దుర పట్టనివ్వటములేదు. అధికయమము. అబ్బా దాహము దాహము.

శకు—నాయనా! యిదిగో జలము సేవింపుము.

దుర్యో—(తాగి) ఓహో! నా పితరులందు! నాయనా! ఆపాండవులేగాని ఘనట్టి యైశ్వర్యములందు నోచుకొనలేకపోతిమి. ఇదె చూడుము గాయము. నేను నూతన సభాభవనంబున మనోవిభ్రాంతిచే తిరుగుచుండ స్ఫటికశిలాతలంబు నాశిరంబునకు తగిలి గాయపడి నేనుండ, ఆపాండవులు భార్యతోసహా నన్ను హేళన జేసిరి. ఇదె గాయము [చూపును] అప్పుడు నేను మిమ్మంతటి ప్రతీకారము సేయకున్న నాపేరు దుర్యోధనుడు గాడని ప్రతిజ్ఞ జాల్చితిని. ఆపాండవుల లక్ష్మియెంత? మనదరిద్రపెద్దమ్మయెంత?

ఉ. భావిపురాతనాద్య తన ♦ పార్థివలక్ష్ములు పాండవేయు ల
క్ష్మివిభవంబుతోడ నుప ♦ మింప సమంబులుగావ శేషరా
జావళులోన నత్యధికు ♦ లైన సపత్నుల పేర్మిజూచియే
జూపై సహింపనోపక కృ ♦ శుండ వివర్ణుడనై తి నెంతయున్.

వారి యైశ్వర్యము లెట్లయిన హరింపవలయును. మామా! నీవైన పాండవవిభవంబు నాచేతులలో పోయవా?

శకు—నాయనా! సుయోధనా! నీవిచారము మానుము. ఒక్క అర నిముషములో పాండవేయుల ధనంబు నీకరమునం బోయుదును.

క. భానుప్రభులగు పాండు మ
హీనాథాత్మజులలక్ష్మి ♦ యెల్లను నీకున్
నేనపహరించియిత్తు ధ
రానుతమాయాదురోద ♦ ర వ్యాజమునన్.

దుర్యో—తండ్రీ! యికనేమి? ధర్మతనయుండు జూదంబునకు ప్రియుం
డు కాని, యందలి యుక్తివంబెఱుంగఁడు. నక్షవిద్యయందతి
దక్షుండైన శకుని నాయందనుండగలఁడు. ఆధర్మరాజును
ఎట్లయిన నిచ్చటకు రప్పింపుము. నీవీ శకుని కైతవంబునకు
ఒడంబడుము. లేదేని యీక్షణము ప్రాణంబుల బాయుఁవాఁ
డను.

ధృత—(స్వగ) ఆహా! ఎంత దుర్మార్గము తలపెట్టినాడీ దురాత్ముఁడు.
ఏపాపంబెరుంగని పాండవుల వంచింపదలచి వారికి ఘోరయి
క్కట్టులఁ గల్పింపనున్నాఁడు. కానిమ్ము వీనిమతము విదురుని
రప్పించి చెప్పించి మాన్పెదను. (ప్రకా) కుమారా! ఆవిషయ
ము విదురునితో నాలోచించి చేయుదును. నీవు విచారము
మానుము.

క. ధీరమతి విదురుతోడ వి
చారింతము వాఁడు నయవి ♦ శారదుఁడు కళా
పారగుఁడు దీర్ఘదర్శియు
పారహితారంభుఁ డుభయ ♦ పక్షంబులకున్.

దుర్యో—తండ్రీ! ఆవిదురుఁడు పాండవపక్షపాతి అతనితో నాలోచిం
పక శకుని మతంబున కొడంబడుము.

తే. దీని కొడఁబడు మొడఁబడ ♦ వేని నేడ
యీక్షణమ సర్వభక్షుచే ♦ భక్షితుండ
నగుదుఁ దెల్ల మేనట్లైన ♦ నగపుదక్క
విదురుఁడును నీవునుండుఁడు! ముదముతోడ.

ధృత—కుమారా! దుర్యోధనా! సాహసింపకుము. నేనిప్పుడే విదురుని రప్పించి వేవుర శిల్పాచార్యులరప్పించి కనకరత్నఖచిత స్తంభములతోనూ, విచిత్రద్వారంబులతోనూ పాండవుల సభవంటిసభ నిర్మింపజేసెదను. ఓరీ ఎవఁడురా అచ్చట!

సేవ—అయ్యా! ఏమి సెలవు.

ధృత—నీవు రేపటిదినంబేగి వేవురు శిల్పాచార్యులను నాయాజ్ఞగా దీసికొనిరమ్ము. విదురునికూడ నేను రమ్మనుచున్నాననిఁదెల్పి దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

ధృత—నాయనా! యింక విచారింపకుము. ప్రొద్దుపోయినది. పండుకొమ్ము. నాయనా! సౌబలేయా! నీవును సుయోధనునకు తోడు పండుకొనుము. ప్రాతిగామీ! రమ్ము నన్ను తోడ్కొని పొమ్ము.

ప్రాతి—(ధృతరాష్ట్రునిఁ దోడ్కొనిపోవుచున్నాఁడు.)

(తెరపడును.)

---

## 3 వ రంగము.

---

### రాజమార్గము.

[విదురుడు విచారముతో బ్రవేశించుచున్నాడు.] కటకటా! నేనిట్టి క్రూరమైనపనికి సిద్ధపడితిని. ఎంతనీతిబోధించినను తుదకు ధృతరాష్ట్రుఁడీప్రయత్నము నడుపుటసర్వానభిమతమని భీష్మద్రోణకృపాచార్యులాది పెద్దలేవచించ ధృవపడినది. నా

నీతి నష్టేటగలిసిపోయినది. పైగా నేనే ఆపాండవులను మాయ సముద్రములో బడద్రోయు ధృతరాష్ట్రుని పనుపున దోడి తెచ్చితిని. ధర్మరాజు సహజశాంతస్వభావుఁడు, అమాయకుఁడు— ధర్మగుణైకమానసుఁడు, జూదము క్షత్రియ ధర్మమని పిలువగానే అందుకు సహజనీతికోపినుఁడు వినయుఁడు స్వయముగఁ పిలువవచ్చినాఁడనియో, వెంటనే తమ్ములతో సహా బయలుదేరి ద్యూతసభ నలంకరించినాఁడు. భీమార్జున నకులసహదేవులకు నయ్యది యిష్టముఁగాకపోయినను లోకధర్మములు బాగుగా నెఱింగిన వారలగుటచే అన్నగారియాజ్ఞాబద్ధులై సమ్మతించిరి. మహాధర్మశీలురు, వీరులు, బలవంతులు, సుగుణశీలురునయిన పాండవులయశము లోకమున ముందుముందు నిండిపోవకమానదు కాని, విచారించిచూడగా ఆసౌబలేయుని మాయాద్యూతప్రభావంబున పాండవులు ప్రస్తుతము బహు కష్టములపాలుఁగా నవుదురని సత్యము తేలుచున్నది. కటకటా! నేనే అన్నివిధముల వారిని చెరిపినవాఁడను, కష్టములపాలు జేసినవాఁడను అగుచున్నాను. ఈమాయాద్యూతప్రభావము నసత్యము. యోచింప కౌరవ వినాశహేతువె యగుననుట కల్లగాదు. పంచపాండవుల ప్రస్తుతము కష్టసమితికి లోనైనను ముందుముందువారికి మహాసత్కీర్తియును రాజ్యప్రాప్తియును గల్గకపోదు. అన్నిటికిని ఆప్తబంధువై శ్రీమన్నారాయణ మూర్తి లీలామానుషవిగ్రహుఁడైన శ్రీకృష్ణపరమాత్ముఁడు పాండవుల సన్నిధినుండ పాండవులకేల కష్టము సంభవించును. ఒకవేళ వారికి కష్టములు గల్గినను శ్రీకృష్ణుడే భరించుకొనును. పరమేశ్వరుఁ డీమాయానాటకము దుష్టసంహారముకొఱ

కే ప్రదర్శింపఁజేయుచున్నాడు. జగన్నాథుని లీలలు గ్రహింపఁ బ్రహ్మకుతరమా? ఓజగన్నాథా! శ్రీకృష్ణా! సర్వము నీమహా మహిమలుగాక వేరుయిపునా? పాండవులను గాపాడుబాధ్యత నీయదియె. అదిగో అప్పుడే ద్యూతారంభమునకు సిద్ధపడుచున్నారు. నేనును ఆవిచిత్రదృశ్యము గాంచెదంగాక.

[ప్రార్థనసేయుచు నిష్క్రమించును.]

[తెరపడును.]

చతుర్థాంకము సంపూర్ణము.





ఓం

# ద్రౌపదీవస్త్రాపహరణము.



## పంచమాంకము.

---

స్థలము—ద్యూతమంటపము.

(ధృతరాష్ట్రుడు, గాంధారి, భీష్ముఁడు, ద్రోణుడు,
కర్ణుడు, దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని
విదురుఁడు, ప్రాతిగామి, పాండవులేవురు
ప్రవేశింతురు.)

ధర్మ—
శకు— } [ద్యూతమాడుచున్నారు.]

భీమ—(రహస్యముగా) అర్జునా! ఈమాయశకుని అన్నగారిని మాయచేయుచున్నాడు. లేనియెడల ప్రతిపందియము వాడే గెలువనేల? ఇందేదియో మాయగలదు. అన్నగారితో వలదని చెప్పుదునా?

అనుబంధము 13.

అర్జు—అన్నయ్యా! వృకోదరా! వలదూరకొనుము. జయాపజయంబులు భగవదధీనములని నమ్మకముతో ద్యూతసభయందుఁ బ్రవేశించి మనఅన్నగారు ధర్మనిష్ఠకు లోబడి పందియము

వేయుచున్నాఁడు యోటువడుచున్నాఁడు. ఇట్టిపట్టున నీవు అన్న
గారి యుత్సాహమునకు భంగముసేయకుము.

శకు—ధర్మరాజా! పందెము నీవె వేయవలయును. ఆలోచింపకుము.

దుర్యో—మామా! జాగ్రత్తగాచూడవలయునుసుమా?

ధర్మ—(పందెమునైచి విచారించుచున్నాఁడు.)

శకు—సుయోధనా! గెలుపునీయదియె. యుధిష్ఠిరా! వెండియు నేమి
వైచెదవో వచింపుము. ఆలసించిన రక్తి చెడిపోవుటయెగాక,
ఉత్సాహము తగ్గిపోవును.

విదు—(స్వగ) అక్కటా! ఈధర్మనందనుడెంత యమాయకుఁడు
శకుని మాయాద్యూతంబున జిక్కుపడినాఁడు. దుర్మార్గులు,
నీచులు, ధర్మరాజుని మాయజేయుచున్నారు. ఆహా! ధర్మ
మూర్తి కళయెంతలో తేజోవిహీనమైపోయినది. పాపాత్ముఁడీ
దుర్యోధనుఁడు జన్మించినదినమే మంచిదిగాదు. పాపము పాప
ము అనుకొనియే పాపకూపమునకు దగ్గరవాడనే యనుచు
పరితపించుచు జన్మించినాఁడు.

క. ఖలుఁడీదుర్యోధనుఁడె
గ్గులలోఁడ నేయుద్భవిల్లె ♦ గోమాయురుతం
బులు సెలఁగె దుర్నిమిత్తం
బులు పెక్కులుపుట్టెవీని ♦ పుట్టినవేళన్.

ఈదుర్మార్గునకు తోఁడు శకుని మరింత ధర్మరాజుని మాయజేయుచు
న్నాఁడు. ఆహా! ధర్మరాజునకుగల సమస్తైశ్వర్యములు అనగా!
నిష్కసహస్రభరితానేకాయుతకుండమండితంబులయిన సువర్ణ
భాండాగారంబులును, వజ్రవైఢూర్యమరకతమౌక్తిక నీలప్ర
వాళపద్మరాగాది వివిధశుద్ధవిపులరత్నపరిపూర్ణంబులైన రత్న

భాండాగారంబులును, ప్రత్యేకంబద్రోణకాంచనసమంచితం బులయిన, చతుశ్శతసంధులును, మణికింకిణీమాలాలంకృతంబులయిన, యసంఖ్యాతజాతరూపవరూథయూథంబులును, కనక కక్ష్యాకుధసనాథంబులయిన మందాంధగంధసింధుర సందోహంబులుం మరియు-బహార్ఘ్యరత్నభూషణ భూషితంబులయిన యోషిత్సహస్రములును-నానావిధభోజన పాత్రహస్తలయిన, శతసహస్రపరిచారికలనూ సర్జునునకు జిత్రరథుండిచ్చిన యేనూఱు గంధర్వహయంబులును—సమస్తమును యోటుపడి యున్నాఁడు కౌరవవినాశహేతువు గల్గబట్టియే భగవంతుడీ నాటకమున ప్రస్తుతము పాండవులకు విచారము గల్పించుచున్నాడు. ముందు ముందు వారికి రాజ్యప్రాప్తియును, సుఖంబును, ముక్తియును, ఘటింపకపోదు.

శకు—ధర్మజా! చూచెద వేల?

ధర్మ—సరిమె యిదిగో అపూర్వమయి సభాభవనంబు నుపణంబుగా వేయుచున్నాను.

దుర్యో—మామా! అతిజాగ్రత్తసుమా ?

శకు—ధర్మరాజా! పంతు నీయుది. నీపుణ్యమెటులున్నదో ఎవరు చెప్పగలరు?

ధర్మ—ఇదుగో పందెము వేయుచుంటిని. అబద్ధమేమియు లేకుండా? (పందెము వేయుచున్నాఁడు)

భీము—(స్వ) దైవమా! అంతియు నాశనమౌచున్నదిగదా!

శకు—సుయోధనా! పందెము మనదే, యుధిష్ఠిరా! నీవోడితివి రాజా! దుర్యోధనా! మయసభామందిరము నీవశమైనది.

అర్జు—(స్వగ) ఆహా! మాకెంతటి కష్టకాలము రానున్నదిరా గదా!

విదు—రాజా! అంబికేయా! నీకుమారుని దుండగములం జూచితివా? మాయాద్యూతంబున ధర్మరాజుతో నాఁడి వారిని కష్టములపాలు జేయుదలంచినాఁడు. తొల్లి మొన్నంతను బాపంబుం బోరయుని మహాభిషభీమసేనపతీపశంతనుల, కులంబు దుర్యోధనుకారణంబునం బాపభూయిష్టంబుగా నున్నయది. రాజా! ఒక్కని కారణంబునఁ గులంబునకెగ్గగునని నాసిదూషించి కులంబు రక్షించుట ధర్మంబని శుక్రుడు చెప్పియున్నాఁడు—కులరక్షణార్థంబుగాదె తొల్లి యంధకయాదవవృష్ణివీరులు కృష్ణునియోగించి కులదూషకుండైన కంసుని వధింపఁ జేసియున్నారు. కావున నీవీసుయోధనునియెడ దయత్యజించుటయె యుక్తము-పాపుఁడు—మహాక్రూరుఁడు.

ఉ. ఇమ్మనుజాధముం గనఁ బి ♦ హీనుబహిష్కృతుఁ జేసిధర్మమా
ర్గమ్మునఁ గౌరవాన్వయము ♦ గావుము పాండుతనూజులం బ్రితా
ళమ్మొసగంగ నేలుమిది ♦ పథ్యమునుమ్మొకనక్కనిచ్చిసిం
హమ్ములఁ బుచ్చికోలు అదె ♦ యన్యులెవారలు కౌరవేశ్వరా!

యిప్పుడీవిధమున నీవు నీకుమారుని త్యజింపకున్న కౌరవవంశమునకు హానిగల్గును.

గీ. అధికదర్పయుక్త ♦ మైబలీవర్ధంబు
నాగగణముతోర ♦ ణంబుఁ జేయఁ
గాలుద్రిప్పునట్లు ♦ గడబలాఢ్యులతోడ
నేఁడు వీఁడు విగ్రహింపుఁదొడఁగె.

రాజా! ఆలోచించెద వేల? శోకనయిన నుపేక్షింపక యీదుష్టదుర్మతిఁ బువారింపుము. ఓహో! నీవున్ను పుత్రస్నేహంబున నద్దియుంజేయవాలక మిన్నకుంటివా? తెలిసినది—తెలిసినది. ఓను

ర్యోధనరాజా! సార్వభౌమా! నీవైనను బుద్ధిదెచ్చుకొని మా యీద్యూతంబు కట్టిపెట్టి న్యాయంబునకు పూనుకొనుము.

క. న్యాయంబువిడచిసౌబలు
మాయాద్యూతమునబాఱ ♦ మతివైభరతా
న్వాయులగుపాండవేయుల
శ్రీయిమ్మోయిఁగొనిననిన్ను ♦ ఛీయనరెమ్మొరుల్.

ఈపాండవులతో విరోధముమాని చిరకాలము పాండవుల సఖ్యముగోరి యుండుము. ఈదుర్వ్యపాయముమానుము. పాండవులు బలవంతులు, గుణవంతులు, ధర్మవంతులు, వారి నన్యాయము సేయుట మీకుమిక్కిలి నీవంశనాశనము. దూరమునాలోచింపుము. న్యాయపాలనకుగడంగి సుఖంబుగ వర్తిల్లుము.

దుర్యో—ఓయీ! పాండవపక్షపాతి! నీయుపన్యాసమును చెవియొగ్గి వినుటకు యిదిసమయముగాదు. యిదిద్యూతసభ. నీవునోరు మూసికొనికూర్చొనుము. నీపక్షపాతబుద్ధి మాకెల్లరకువిశదమే.

శకు—ధర్మజా! చూచెదవేల? పందెమునకు మొల్లము కనపర్చుము. కనపర్చనిచో జితోస్మి! యని ఒక్కసారి నీనోటినుండి పల్కుము. చూడుము సభాసదులు నీయధైర్యమునకు ఎట్లు నవ్వుచున్నారో—ఏమి ఆటచాలించుటయేనా?

ధర్మ—సౌబలేయా! వృథామాటలు పెక్కులు బల్కనేల? ఇదిగో నాసకలరాజ్య సర్వస్వము అనగా "దేవభోగభూసుర మాన్యములు తప్ప" పణంబుఁగానిడితిని. న్యాయవృత్తి పాచికలచేత బట్టుమునుమా? (అని పందెము వేయుచున్నాఁడు)

శకు—ఆ. ఇంకేమున్నదిఁ రాజా! సరిగా చూడుము గెలుపుమాయదియే. దుర్యోధనసార్వభౌమా! రాజ్యసర్వస్వమూ ధర్మరాజు

ధర్మద్యూతమున నీకరము లబడినది. ధర్మరాజా! పైపందెము వచింపుము.

భీము—(రహస్యముగ) అర్జునా ! సర్వము సున్నమైనది. శకుని శిరస్సు వ్రయ్యలు జేతునా ? (పోబోవును )

అర్జు—(పట్టుకొనుచున్నాడు.)

ధర్మ—సౌబలేయా ! సకలగుణ విశారదులైన నేనును నాసోదర చతుష్టయంబును పణంబుగా నిడుచున్నాను—నిరంతరమదా జ్ఞాబద్ధకంకణులైన నాసోదరులు యిందుల కంగీకరింతురుగాక.

శకు—సుయోధనా! గెలుపు నీయదియె ?

భీము—(శకునిపై బోవబోవును.)

అర్జు—(వారించును)

ధర్మ—పంచపాండవులకు ప్రాణధనంబును—శ్రీకృష్ణున కనుంగు చెల్లెలును—ద్రుపదరాజకుమార్తెయునయిన పాంచాలిని పణంబుగా గాయుచున్నాను.

(పందెము వైచుచున్నాడు)

శకు—సరిగా బరికించుము గెలుపు మాయదియే సత్యముకాదా?

కౌరవేంద్రులు—[చప్పట్లుకొట్టి కేకలు వేయుచున్నారు.]

శకుని—సుయోధనసార్వభౌమా! యుధిష్ఠిరుని తమ్ములతోసహా భార్యతోసహా సర్వస్వంతోసహా ధర్మరాజు సహితము నీవశ్యమైరి. అంతయు నీయదియె పాండవులు వారిసపత్నియు నీకు సేవకులైరి.

దుర్యో—ఖండితశ్రోత్రా! విదురా! ఇంకనీవుపోయి ఆద్రౌపదిని శీఘ్రం
బుగ నీసభాభవనమునకు దోడ్కొనిరమ్ము. క్రొత్తగా ఆమె
మాకు సేవకురాలయ్యెను. ఇప్పుడీసభాస్థలము చీపురుగట్టతో
నూడ్పించవలయును. నీయాజ్ఞపైగాని ఆమె ఈసభాస్థలమునకు
రాదేమో? దాసుచేయుటకు నీవు వారికి యిష్టుడవుగదా?

విదురు—ఓరీ! పొంగకుము. నిజముగ నీదుర్వ్యాతకారణమే నిన్నును నీ
వంశములు నిర్మూలనమొనర్పగలదు.

క. మదమలినమనస్కుండై
తుదిలేక వినయముసేయు ♦ దుర్జనునకు సం
పదపెద్దయయ్యునాతని
మొదలిటిసంపదయుజెడు స ♦ మూలముదీనన్.

మీదుమిక్కిలి నీవంశము నాశనమౌటతథ్యము.

భీము—[పండ్లుగొఱుకును.]

అర్జు—[రహస్యముగా] అన్నయ్యా! ధర్మమునకు కట్టువడుము.

దుర్యో—విదురా! నీవెన్నడును మాకు మేలుగల్గునటుల దీవించి
యెఱుగవు. పరులగుణంబుల స్తుతించుటయెనీపని. నీపాండవుల
పని నీపని యొకమూలకూర్చొనుటయే? అదిగో ఆమూలచది
కిలబడుము పొమ్ము. ఓయీ! ప్రాతికామీ! నీవుపోయి ద్రౌప
దిని జరిగినసంగతివచించి యిచ్చటకు దీసికొనిరమ్ము. పొమ్ము.

ప్రాతి—చిత్తము.

[నిష్క్రమించుచున్నాడు.]

[అవనిక బడును.]

## ౨ వ రం గ ము.

అంతఃపురము—(ఒంటరిగ ద్రౌపది ప్రవేశము.)

ద్రౌప—[స్వగ] కటకటా! నాపతులేవ్వరును ఆమాయావి దుర్యోధనుని దుర్వ్యవసాయంబునకు లోనైతిరని వినియుంటిని. శకుని నా ప్రాణనాథుల నెంతమాయ జేయుచున్నాడోగదా! ఈనాఁడే మో నాకనేక దుర్నిమిత్తములు పొడగట్టుచున్నవి. ఎట్టివిపత్తు రానున్నదియో గ్రహింపజాలకుంటిని ఓకృష్ణా! దేవకీనందనా అంతయునీదే బాధ్యత.

ప్రాతి—[ప్రవేశించి] అమ్మా! దాసుని ప్రణామములు.

ద్రౌప—సుఖముగవర్థిల్లునాయనా! నీముఖారవిందముగాంచ నాకేదియో ప్రమాదవార్తఁదెలియజెప్పవచ్చినచారునివలె నుంటివి. విశేషములేమి నాయనా!

ప్రాతి—తల్లీ! ఏమనిచెప్పుదును. ధర్మరాజు మహారాజుగారు సమస్తమును ద్యూతంబున కౌరవులవశముజేసి వెండియు తానును తనసహోదరచతుష్టయమును దేవేరిగారునుకూడ కౌరవులకు వశ్యులైరి. సేవకులైరి. దుర్యోధనరాజుగారి ఆజ్ఞగానిన్నుసభాస్థలమునకు గొంపోవవచ్చిన పాపాత్ముఁడను. ఆలశ్యముచేయక వెంటనే సభాస్థలమునకు వేంచేయుఁడు.

ద్రౌప—(విచారముతో) నాయనా! ఇయ్యది నిజంబేనా లేక మృషయా? ఆహా! భార్యలను ద్యూతంబున నొడ్డుమగవారలు కలరా? అయ్యో! ధర్మనందనా? నీవాదుర్యోధనుని దుర్వ్యవసాయంబునకు బాల్పడి ధర్మసంరక్షణార్థమై, భార్యను సహి

యిటు ద్యూతంబున పణంబుగా నుపయోగించి, నన్ను వారికి సేవకురాలినిగా జేసితివా? నాయనా! ఇది సత్యంబైన మరొక సారి నా చెవులఁ బడ వేయుము.

గీ. ఏయుగంబునందు ♦ నెట్టి దుష్కృతవ్రుండు
భార్యనొడ్డి యోటు ♦ పడిన భర్త
గలఁడె యిదివినంగ ♦ గడు నపూర్వంబయ్యె
నిట్లు సేయునొక్క ♦ యింపకులుఁడు.

ప్రాతి—అమ్మా! ఇందబద్ధమెంతమాత్రము లేదు. నీవు సభాస్థలము నకు చెచ్చెర దయచేయుము.

ద్రౌప—నాయనా! వచ్చెదఁగాని, ఒక ప్రశ్న నీకు దెలిసిన యెడల చెప్పుము.

గీ. మున్ను నన్నోటుపడి మరి ♦ తన్ను నోటు
పడియెనో తన్ను మున్నోటు ♦ పడి విభుండు
గ్రన్న నన్నోటుపడియెనో ♦ యన్న నాకు
నెఱుగఁ జెప్పుము దీనినీ ♦ వెఱుఁగుదేని.

నాయనా! నీకావిషయముఁ దెలియనియెడల సభాస్థలమునకుఁబోయి దెలిసికొనిరమ్ము.

ప్రాతి—అటులేపోయి అడిగివచ్చెదను.

(నిష్క్రమించును.)

ద్రౌప—ఆహా! శ్రీకృష్ణా! జగన్నాటకమంతయు నీవిధముగ నాడించి ప్రస్తుతము మమ్ము నిడుమలపాలు జేయుచుంటివా? నారాయణా! అంతయు భారము నీయదియె? ఇప్పుడు నన్నా దుర్మార్గులు ఎట్టికట్టఁడులపాలు జేయుదురో తెలియకున్నది.

ప్రాతి—(పునఃప్రవేశించి) తల్లీ! నీవడిగిన ప్రశ్నకు కడువిచారముతో నీభర్త పలుకడయ్యెను. అయ్యది సభాసదులనడిగి తెలిసికొన వచ్చును. ఇచటకుఁ దోడి తెమ్ముఅని రాజాజ్ఞఅయినది. రాజాజ్ఞ సేవకుకు నేరవేర్పకతప్పదు

ద్రౌప—నాయనా! ప్రాతికామీ! అటులే నీరాజాజ్ఞ నెరవేర్చుకొన వచ్చును. సభాసదులు సమ్మతింపవచ్చునుకాని నేను రజస్వలనున్నూ ఏకవస్త్రనున్నూ నీవంటివాడు ముట్టుకొననిదాననునై యున్నాను. ఎట్లు నేనా సభకు రాగలను. వచ్చినను వారు సమ్మతింతురా?

దుశ్శా—(త్వరగ బ్రవేశించి) ఏమీ? విగతవస్త్రనైయుంటివా? విగతవస్త్రవైననేమి? ఏకవస్త్రవైననేమి? రాజాజ్ఞఅయినదిరమ్ము

[మీదికిబోవును.]

ద్రౌప—నాయనా! దూరముననుండుము. ముట్టగూడదు.

దుశ్శా—అయ్యదినాకు పనికిరాదు రమ్ము. [అని జుట్టుపట్టి ఈడ్చుకొనిపోవుచున్నాడు.]

ద్రౌప—హాకృష్ణా! కృష్ణా! మహాత్ముల ప్రవర్తన కండ్లతోగాంచి చూచుచుంటివా? హాపరమాత్మా! అంతయునీదేబాధ్యత.

[తెరలేవగా ద్యూతసభ కనబడుచున్నది.]

దుశ్శా—[ద్రౌపదిని సభామధ్యమున విడచుచున్నాడు.]

కౌరవేంద్రులు—భళీ. భళీ! (అనుచున్నారు.)

ద్రౌప—ఆహా! దైవమా! యిదేమిచిత్రము — ఓసభాసదులారా! భీష్మద్రోణాదిమహాపుణ్యపురుషులారా! ఇదేమిన్యాయము ధర్మనందనుడిట్టిపని చేయునా?

చ. అనుపమదైవయోగమతు ♦ డయ్యె నవశ్యము ధర్మసంపదం
దనరునకాని ధర్మజుఁడు ♦ ధర్మపథంబది యేల తప్పెఁ దౌ
ష్కృతను గురువృద్ధులార! భృశ ♦ కోపనుఁడీతఁడు నన్ను నేల దు
ర్జనుఁడిట కీడ్చి తెచ్చెనవి ♦ చారపరుండయి దుర్మదంబునన్.

భీము—అన్నా! పాంచాలి దుఃఖముఁ గాంచితివా? నీయూలమున
నెంతవిలపించుచున్నదియో?

క. ద్రుపదతనూజం బణముగ
గపటద్యూతమున నొడ్డ ♦ గాదగునె జనా
ధిప యీదుష్టద్యూతము
నెపమునఁ బరిభూతయయ్యె ♦ నిష్కరుణులచేన్.

శకుని కై తవంబెఱింగియుఁ బాపద్యూతంబునందు బ్రవర్తించి యధర్మ
ప్రవృత్తుండవయితివి, కావున భవద్బాహుదాహంబు చేసినను
పాపములేదు. (అని కోపముతో అన్నగారిని సమీపించ
బోవును)

అర్జు—(పట్టుకొని) అన్నయ్యా! వృకోదరా! ధర్మరాజు అయిన మన
అన్నగారు ధర్మవ్యతిరేకులుగాక ధర్మసంరక్షణార్థమై యిట్టి
పనికి దొడబడినవాఁడయ్యెను. నీవు శాంతింపుము. ధర్మనిర్మూ
లనము సేయకుము.

వికర్ణ—(లేచి) ఓసభాసదులారా! అన్యాయశ్రవణ వికర్ణులై యిట్లు
మిన్నకుండెదరేల? ఒక్కరికైన జ్ఞానము భగవంతుఁడు ప్రసా
దింపలేదా ఏమి?

క. సమచిత్తవృత్తులగు, బు
ద్ధిమంతులకు నిప్పుఁడు ద్రౌపదీప్రశ్న విచా
రము సేయవలయు నవిచా
రమునఁ బ్రవర్తిల్లుటది న ♦ రకహేతువగున్

కురువృద్ధులైన భీష్మ ధృతరాష్ట్ర విదురాదులును-నాచార్యులైన ద్రోణ
కృపాదులును నోరుమూసుకొని యలుకరైరి. ఈయున్న సభా
సదులెల్లరు గామక్రోధాదులు దక్కి విచారించి చెప్పుడు.
అట్లు మీరు చెప్పజాలకున్న నేను ధర్మనిర్ణయము చేసెద
నెల్లవారును వినుండు—ఏమందురేని? జూదంబును వేటయుఁ
బానంబును బహుభక్షణాసక్తియు ననునాల్గును దుర్వ్యసనంబు
లందగిలిన పురుషుండు, ధర్మువుఁదప్పి వర్తింపఁబట్టి వాని కృత్యం
బులు సేకొనఁదగవు. కితవాహూతుండై వ్యసనవర్తియయిన
పాండవాగ్రజుండు పాండవులకందరకు సాధారణధనంబయిన
పాంచాలిఁ బణంబుఁ జేసెఁగావున, ద్రౌపది యధర్మవిజిత,
యిక్కోమలి నేకవస్త్రనిటకు దోడ్కొనితెచ్చుట యన్యా
యము—యన్యాయము—యన్యాయము—ఘోరము. అని చెప్ప
సాహసించితి.

సభ్యు—సత్యము—సత్యము.

కర్ణు—ఏమీ? ఇదియా నీధర్మనిర్ణయము. నీవచనంబులకు నాప్రత్యా
ఖ్యానంబు చేయుచుంటిని వినుము. బాలుఁడవు నీవా ధర్మనిర్ణ
యము సేయువాడవు.

గీ. ఎల్లవారు నెఱుఁగ ♦ నొల్లని ధర్మువు
బేలనీవుఁ జెప్ప ♦ నేలవలసె
జఱుతవానికింత ♦ గఱువంపుపలుకులు
సన్నవృద్ధజనము ♦ లున్నచోట.

నీవు ద్రౌపది యధర్మవిజితయని పల్కితివిగా? ఈసభాస్థలమునగల
సదస్యులెల్లరు నెఱుంగ ధర్మజుండు తనసర్వస్వమ్మును నొడ్డి
యోటువడినప్పుడిది వానికి వెలిగాదు. కావున ధర్మవిజిత
యయుట్లుఁగానినా దీపాండవు లిందఱును విజితగా నేలయొదం

బడుదురు. వెంకీయు నేకవస్త్రయైయున్న నీమెను సభకుం దెచ్చుట యధర్మమార్గమంటివే? ఎట్లు? భార్యకు దైవాధిష్టితుండయిన భర్తయొక్కరుండె యిది యనేకభర్తృక కాబట్టి బంధకీయనంబడును. యిట్టికన్యను విగతవస్త్రంజేసి సభాస్థలమునకు దెచ్చుట ధర్మవిరోధంబు ఎంతమాత్రముకాదు. న్యాయము—న్యాయము—న్యాయము అని నేను ఘంటాపథముగా బల్కుచుంటిని.

దుర్యో—దుశ్శాసనా! పాండవుల వసనంబుల నొలిచి చెచ్చెర తెమ్ము.

దుశ్శా—పాండవులారా! యిప్పుడు మీవస్త్రంబులన్నియు తీయుడు. యివిగో మీకు సేవకావృత్తి కేమమునకుఁ దగినబట్టలు.

భీము—(రహస్యముగా అన్నగారితో) అన్నా! ఒక్కపిడికిటపోటున చంపుదునా?

అర్జు—శాంతించుము. ఇదిసమయముకాదు.

[పాండవులకు బట్టలు యిచ్చుచున్నారు.]

దుశ్శా—ఏమే? దాసీ! నీవుకట్టిన వస్త్రంబులనిమ్ము.

(అనిలాగుచున్నాడు.)

ద్రౌప—హా కృష్ణా! కృష్ణా!

అనుబంధము 14.

భీము—(కోపముతో) ఓరోరి కౌరవేంద్రులారా! నిలుము నిలుము.

అనుబంధము 15.

ఉ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవులనే ♦ కుల్ చూచుచుండఁగ మదోద్ధురుఁడై ద్రౌపదినిట్లుచేసిన ఖలుం ♦ దుశ్శాసనున్ లోకభీకరలీలన్ వధియించి తద్విపులవ ♦ క్షశ్శైలరక్తోరుని ర్ఝరముర్వీపతిచూచుచుండననినా ♦ స్వాదింతునుగ్రాకృతిన్.

యిట్లు సేయనైతినేని పితృపితామహులగతికి దప్పినవాడనే యగుదును.

దురాత్ములారా! వదరకుఁడు. అన్నగారియాజ్ఞకు కట్టువడితిని కానిండు.

దుర్యో—(ద్రౌపదిని తొడపై కూర్చుమ్మని సంజ్ఞ చేయుచున్నాఁడు.)

దుశ్శా—[బట్టలవిప్పుచున్నాడు.]

భీము—(కోపముతో) ఓరోరి! పాపాత్మా! దుర్యోధనా!

ఉ. ధారుణిరాజ్యసంపదను ♦ దంబునఁ గోమలి(కృష్ణ)జూచి రం
భోరునిజోరుదేశమున ♦ నుండగబిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరి ♦ వర్తితచండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదును ♦ యోధనునుగ్రరణాంతరంబునన్.

కాచుకొమ్ము. [అని ఆయుధము నెత్తబోవును.]

భీష్మ—అనిలాత్మజా! ఇదియుద్ధంబునకు సమయముగాదు మిన్నకుండుము.

దుశ్శా—[వస్త్రములు విప్పును.]

విదు—యిప్పుడు ఒకమహాదృశ్యమున సభ్యులెల్లరు భయంబున మూర్ఛాగతులౌదురని దోచుచున్నది.

ద్రౌప—హాకృష్ణా! కృష్ణా! రక్షింపుము. రక్షింపుము.

## అనుబంధము 16.

ద్రోణు—ఆహా! జగంబు యేలోకోగాని గిరగిరదిరుగుచున్నయది.

దుశ్శా—ఓసీ! ఎన్నిబట్టలజుట్టితివే?

ద్రౌప—కృష్ణా! రక్షింపుము. రక్షింపుము.

(అప్పుడు కృష్ణుఁడు ద్రౌపదికి వస్త్రము వదలుచు ఆకాశమున గంభీరాకృతిదాల్చి కనఁబడుచున్నాఁడు)

అందఱు—హా! భయంకరము! భయంకరము.

(అందరు పడిపోవుచున్నారు)

తెరవ్రాలును.

---

3 వ. రంగము.

---

ధృతరాష్ట్రుని మందిరము.

(ధృతరాష్ట్రుఁడు, గాంధారి, ద్రౌపది, పాండవులు ప్రవేశింతురు)

ధృత—అమ్మా! సాధ్వీతిలకమా! నీమహామహిమఁ దెలియలేక నేను కేవలము బుద్ధిహీనుండనయి నీకును నీపతులకును మాయాద్యూతమిషచే ననేక కష్టంబులఁ గల్పించితిని.

అనుబంధము 17.

క. సుందరి నాకోడండ్రర
యందభ్యర్హిత్వపునీవ ♦ యతిమదమున నీ
కుందగఁ బ్రియంబు జేసెద
నిందుముఖీ వేఁడుమెద్ది ♦ యిష్టమునీకున్.

ద్రౌప—మామయ్యా! ధృతరాష్ట్రమహారాజా! శ్రీకృష్ణపరమాత్మ యనుగ్రహంబున నాయీ ప్రమాదము తప్పినది. తమరు నాకు వరంబులొసంగెదననుచు కోరి గాన వేఁడుచున్నాను.

గీ. కరుణతోడ నాకు ♦ వరము ప్రసాదించి
బుద్ధియేని లోక ♦ పూజితుండు
మనునిభుండు ధర్మ ♦ తనయుండు దాస్యంబు
వలన బాయువలయు ♦ వసుమతీశ!

ధృత—కోడలా! నీకోర్కె ఫలించుగాక! నీకావరము తప్పక ఒసంగితి మరొకవరము కావలయునేని కోరుకొమ్ము.

ద్రౌప—మహాత్మా! తమయనుగ్రహంబున ధర్మనందని దాస్యము నిర్మూలమైనది. లోకము సంతసించెను. మరొకటి కోరుకొన మనుచుంటిరి గాన ప్రేమతో నొసంగ ప్రార్థితులు.

క. నెమ్మినిధర్మజునలువురు
దమ్ములు దనువస్త్రములయు ♦ దమ శస్త్రవరా
ధమ్ములతోడను సకలహి
తమ్ముగ బాయంగవలయు ♦ దాస్యమువలనన్.

ధృత—అన్యవిచారములేకుండ గైకొమ్ము. మూడవకోర్కె-కూడ నొసంగెద. కోడలా! సంశయింపక కోరుము.

ద్రౌప—మహారాజా! ఇంకచాలును. తమరనుగ్రహించిన నాకువర ములకు కొదువగల్గునా?

గీ. వైశ్యసతికినొక్క ♦ వరముకు క్షత్రియ
సతికిరెండు శూద్ర ♦ సతికిమూండు

విషాసతికినాటు ♦ వేడంగజనుగాని
యిఁకవేడనగునె ♦ యిభపురీశా!

ధృత—మహాధర్మస్వరూపురాలవగు నీకు దెలియని విశేషములు ప్రపంచమునకలవా? తల్లీ! నీసుగుణసంపత్తికి సంతసించితి. నీవు అడుగకున్ననుసరె, నేవరంబు లొసంగెదను. నాయనా! ధర్మరాజా! యిటురమ్ము. నాతప్పుల క్షమింపుము.

గీ. నీవునిత్యంబు వృద్ధోప ♦ సేవజేసి
యెరుఁగుదెల్లధర్మంబుల ♦ నెఱుగలేక
కడగినీకెగ్గుఁజేసెనా ♦ కొడుకుదీని
మఱచునదినేను నిన్నొండు ♦ గఱపనేర.

ధర్మ—[తమ్ములతోసహా వందనమాచరించి] తండ్రీ! అయ్యది నీ తప్పుఁగాదు. నీకొమారునితప్పుగాదు. ఇదియంతయు జగన్నాటకసూత్రధారియొక్క మాయానాటకము. అందులకై మీరు విచారింపకుడు.

గాంధా—బిడ్డలారా! తమ్ములైనటువంటి నూరుగురు కౌరవులును మీరును మనస్పర్థలులేక సుఖముగ నుండుడు.

ధృత—నాయనా! ఏనుబుద్ధిలేక జూదం బపేక్షించితి దానంజేసి యింతలుపుట్టెను. అల్పబుద్ధి సత్పుండనయిన నన్నును మీతల్లియయినగాంధారినిందలంచి దుర్యోధనాదులుజేసిన దుర్నయంబుల

దలంపక సుఖంబుగ సర్వధర్మవిదుండవైన నీవు రాజ్యంబు పాలించుకొమ్ము.

క. మనమున వైరము దలపమి
యును సద్ధర్మాత్ముడగుట ♦ యును గుణములు సే
కొని దోషంబుల విడచుట
యును నుత్తముడయిన పురుషు ♦ నుత్తమగుణముల్

కావున, నీవు ఎప్పటియట్లు నిజధర్మాధర్మము తెలిసిగి రాజ్యము సహోదర చతుష్టయముతోనహా పాలించుకొమ్ము. కోడలు ద్రౌపది మహాసుగుణవంతురాలు, మీకేవురకు తగిన ప్రాణ ధనము. ఆమె మాహాత్మ్యమువలననే మీచెరలు బాసినవి. సకల సద్గుణసమన్వితురాలు, నాయనా! ధర్మజా! మీకష్టము లు హరించినవి యింకేమయిన అభీష్టముగలదేని వచింపుము.

ధర్మ—తండ్రిగారి యాజ్ఞప్రకారము కౌరవ పాండవవృక్షంబులు వైర ము లేకుండనుండుటయే నాయభీష్టము. యింతకంటె నేమి గావ లయును, లోకంబునంగల శత్రురాజులు మిత్రులై-స్త్రీలు సాధ్వీ తిలకములై— దేశము సకల యైశ్వర్యసమన్వితమై—యింతయేల సర్వలోకములకు మంగళం బొనటుల పరమేశ్వరు డనుగ్రహిం చుగాక! యిదియె నాయభీష్టము.

ధృత—తథాస్తు! తథాస్తు!! తథాస్తు!!!

## అనుబంధము 18.

మంగళము

ఇది

శ్రీరమానాథధ్యాన సేవాతత్పర తెలుగుమహాముని గోత్రపవిత్ర

పవిత్రి దుంగావంశ పయోరాసి నరసమాంబాపేర

నార్యచతుర్థపుత్రి లక్ష్మీనృసింహ నామధేయ

ప్రణీతంబైన, ద్రౌపదీవస్త్రాపహరణ

నాటకము పంచమాంకము

సర్వము సంపూర్ణము.





# అనుబంధములు.

## అనుబంధము 1.

### జనకసంవాదము.

బ్యాగ్—ఆదితాళము.

యతీశ్వరులనా । పరితాపపెట్టి చె । క్షితింజెచ్చెరను । శిక్షింతున్॥

క్షితీశ్వరుఁడనను । భయంబునింపెను ।

మతంబుగాన్పద । మహిలోనగ ॥యతీ॥

పాతకమో । ఘోరానారకమో । పరితిభానాశనమో ।

యేమయినం సరియేయిక । హింసించెద ఘోరంబుగనే ॥యతీ॥

---

## అనుబంధము 2.

### సహదేవుఁడు.

మోహనరాగము—చాపుతాళము.

తగునా యిదిజనకా । తగవారై । తాపసులంమోదగ ॥తగు॥

సన్మార్గులున్ । సద్భక్తులయిన । సత్యగుణాత్ములు ।

నా । తపసివరులనిటుసేతువే ॥తగు॥

జాగదేలసత్వరముగ । జగమునిచెంతజేరి ।

ముక్తికినపుణ్యంబుండు । మోక్షమార్గముగ గాసుమ్మా ॥తగు॥

---

అనుబంధము 3.

రాజులు.

జి గ్లా—ఆదితాళము.

శ్రీమవదలింపుముస్వామీ । సరగునవినిమానుడులను ॥శ్రీమ॥
నరహరి మురహరి । నారాయణయిక । సదయముగ
నీవునత । రక్షపారస సుతో ॥శ్రీమ॥
లోకజనముకడు । శోకహృదయులయి । ప్రాకట
గతినిక ప్రేమబిలుతమా ॥శ్రీమ॥

అనుబంధము 4.

నారదుండు.

(హే సుగుణధామ—శుభదశ్యామ వలె)

ఓ సుజనరక్ష । సుజనపక్ష । సుందరసుగుణ ।
విబుధవందితా । కలుషబాధితా ।
శ్రీరమరమణా । భూరమరమణా । ధారుణా కారణా
తాపసవంధ్యా । తాపసపోషా । తాపసరూపా ।ప్రణుతులో॥

---

అనుబంధము 5.

నారదుండు.

కేమాంచిరాగము—ఏకతాళము.

ఆహాహా! ఈసభసోయగమిలలో । స్తుతింపనశక్యంబా
హరిహరులశక్యంబా ॥ఆహా॥

భువిత్రయము నెచ్చటను । కనంగా । వినియు వినగా । లేదెన్నడు
విరచితంబై । సభ । మహేంద్రసంస్థకంబై ।
చోద్యమగుచు । సుందరంబెయగా ॥ఆహాహా॥

---

అనుబంధము 6.

నారదుఁడు.

భైరవి రాగము — రూపక తాళము.

భజ భజ । శ్రీనాధా ।
సుజ నవి । నుతరామనామ ।
మదిదలంతు । శుభగశీలా । ఆ, ఆ, ॥భజ॥
గజవరదా ముఖ్య । బుజభూషణ । నిత్యాశ్రిత ।
సుజనలోక సంరక్ష । సురలోకపక్ష ॥భజ॥

---

అనుబంధము 7.

శకుని.

మోహన రాగం — ఆదితాళము.

సుయోధనా ! రాజా !
చింతిల్లగత మదేల కలిగె ధర ॥సుయో॥
హయగజములు తేరులు యపారముగ
ధనధాన్యంబులు గలుగ వగచెదే ॥సుయో॥
భయమేల ఘటి । ల్లెనికదెలుపుమా ।
పరులెవ్వరైనను । పరుషములాడిర ॥సుయో॥

---

## అనుబంధము 8.

శిశుపాలుఁడు.

మోహనరాగము—చాపుతాళము.

వఱఁడా । యిదిహితమా ।
వసుధం యమునందనుఁ పూజించుట ॥వఱ॥
  కూర్మిరాత్ముఁడున్ । క్షోణీస్థలిని మ । హాశలుపాత్మునే ।
    కోరఁఘనుఁడని । ఘనతఁబల్కనో ॥వఱ॥
  జోరసంఘుజుం డీతఁడని । సుదతులనేఁడి మాటపొల్లె ।
    దూరము నాలోచింప । దోర్బలుం డెటులగు నితండు ॥వఱ॥

---

## అనుబంధము 9.

కృష్ణ శిశుపాలురు.

డైలాగ్.

కృష్ణు—ఔరా రా! వదరకుమిక । నరికెద చక్రముతో ననిలో ।
    త్వరంబడకు నీ । శిరంబు నిజమిా । ధరంతటాలునగూలునురా॥
శిశు—రారా కూర్మిరా దృంతుఁ వేగఁ ।
కృష్ణు—పోరాపాపీ నిల్వంలేవ్రా ।
శిశు—మాధవరాకుము । యిత్యాది । మాశిని ।
    వాదముఁ గాదుర । వైరమురా॥
కృష్ణు—వాదమదేలర । నీదభుజాబల ।
    మేదిరచూపర । దుష్టుఁడఁ జెప్పేర ।

శిశు—నిలరా। ఖలుఁడా। నిను గెలుతున్।
కృష్ణ—ఛీ-ఛీ-దుష్టా!
శిశు—రా-రా-చోరా!
కృష్ణ—రణరంగమందు నిలువుమురా।
శిశు—రణమందుగూల్చు పేరిలకురా॥

---

అనుబంధము 10
శిశుపాలుఁడు.
మాల్ కౌస్—ఆదితాళము.

ఖలమతి పేరిలకురణమున నినుఘన।
కాలుని వీటికి। క్షణములోబంపెద॥ఖల॥
పలుభీష్ముఁడిటు మునలితనముననుఁ।
పలికెను వాఘన। పూజ్యార్హుండని।
కలుఁగఁడికఁ నిను బోలెడి పాపుఁడు।
కూళుఁడు దుష్టుఁడు చోరుఁడు జగతిని॥ఖల॥

---

అనుబంధము 11.
దుర్యోధనుఁడు.
హిందోల్—రూపకతాళము.

మాతులా! శకునిమహేశా। మామకీస్థితిఁదలంపు॥మాతు॥
పాండవులధనంబుభువిని। ప్రబలెనెటులనుకనివిని।
మొండినగుచు జీవములన్। నిలుపఁ। ధరనే। దున్నాకో॥మా॥

---

అనుబంధము 12.

శకుని.

బ్యాగ్—ఆదితాళము.

మోదమలరచిత్తమునను ధృతిగను పుత్రా ।
కురుకులేశ । ప్రదితశూరా । జగతవంద్యా ।
మనమున వగవకుమిక ॥మోద॥
ద్యూతమునం పాండవులను నిజముగఁ ।
గెలువసాధ్యమగునికనే । ద్రవ్యమెల్ల గెల్చియిత్తు
పాండుసుతుల దరిమెద నడవులకున్
చింతల్ గూర్తు౯ సరగునవారికి । ఘనతరసుఖమునుగనుమా॥

---

అనుబంధము 13.

భీముఁడు.

వసంతరాగము—ఆదితాళము

చూడలేను యీ । జూదమునేనిక ।
పుడమి ధర్మజు౯ । మోసమునలిపిరి ॥చూడ॥
కదు౯ద్రుంచెద౯ । కౌరవనాథుని
పీడకశకునిని । వేగవధించెద ॥చూడ॥

---

అనుబంధము 14.

ద్రౌపది.

ముఖారిరాగము—రూపకతాళము.

ప్రార్థింతూదంతివరద । పాపుల౯ వధించిబ్రోవుమా ॥ప్రార్థింతూ॥

కౌరవులిట । నన్నీగతి । కట్టినవలువలనకటా ।
ఘోరంబుగ । విప్పుచుండ । దారుణమిదిగాదెకృష్ణ ॥పా॥
పరమక్రూరులైన కౌరవు । లరయరైరిధర్మమింత ।
కరుణరాదతండ్రినీకు । సురవరనుత శ్రీనివాస ॥పార్థింతూ॥

---

అనుబంధము 15.

భీముఁడు.

ఇంగ్లిషునోటు—ఏకతాళము.

ధరసుయోధనుఁ వధించివత్తు వేగమిప్పుడే ।
ఖలుఁడుయిట్లుమాయజేసి । గర్వమొందుచుండగఁ
వే—వే—గఁ—వానిబట్టికాలునీ పురికవిపెద ।
ననుజవిడువు । యిపుడెచనియెదఁ ॥ధరసుయో॥

---

అనుబంధము 16.

ద్రౌపది.

భీంపలాస్—త్రిశ్రగతి.

సతీలోకప్రార్థనంబు జగతివినుమ మాధవా ।
వినికృపఁగను కేశవా ॥సతీ॥
ద్యూతనెపంబున క్రూరాత్ములుకడు దోషమొనర్చి
రి ధర్మజునీ । కలుషమతుల । నెటులనడచి
కాచెదవు సతీమణిఁ । కాచెదవో సతీమణిన్॥
(సాక్షాత్)ధాత్రిధర్మాధర్మంబెంచ ప్రధానంబుదేవా ।
దంతిసంరక్షాయలక్ష్మీవిలాసాయయీశా
(మిత్రము) ఈతరిమమురక్షింపం । గనురావా ।
మునిపోషా । గుణభూషా ॥సతీ॥

## అనుబంధము 17.

### ధృతరాష్ట్రుడు.

**నాటకకురంజి—ఆదితాళము.**

అమ్మద్రౌపదీ । రమ్మా । సాధ్వీమణి ॥అమ్మ॥
కొమ్మనీవుకోరు । కొమ్ము కోర్కెలిత్తు ॥అమ్మ॥
యిమ్మహీస్థలిని యి । కనినుబోలు సాధ్వి
నమ్మఎందుచూడ । సుకుమారికోరు ॥మమ్మ॥

---

## అనుబంధము 18.

### మంగళహారతి.

మంధరధర । మంగళకర । మంగళంబురా ।
మారసుందరా । శ్రీరమేశ ప్రోవరా ।
దానభరణ । దోషహరణ । దానవేశనాశా ।
శ్రీనివాసజగదీశా । శ్రీరామా । నాయకా ।
జగన్నాయకా ॥మంధ॥



శ్రీరామాప్రెస్, రాజమండ్రి.—1932.